# శత్రువులు

అనువాదం :

అశ్వినీ కుమార దత్తు



ఆదర్శ గ్రంథ మండలి,
విజయవాడ 1.

## —: పాత్రలు :—



జఖార్ బార్డిన్ : 45 సంవత్సరముల ప్రాయం.

పౌలీనా : అతని భార్య, 40 సంవత్సరముల ప్రాయం.

యాకోవ్ బార్డిన్ : 40 సంవత్సరముల వయస్సు.

తాత్యానా : అతనిభార్య, 28 సంవత్సరములప్రాయం, నటి.

నాద్యా : పౌలీనా సోదరికుమార్తె, 18 సం॥ల ప్రాయం.

పెచెనిగోవ్ : ఉద్యోగం విరమించుకున్న సేనాధిపతి. బార్డిన్లకు మామ.

మైఖేల్‌స్ట్రాబొటోవ్: 40 వత్సరముల వయస్సు, వర్తకుడు, బార్డిన్ల తోడి భాగస్వామి.

క్లియోపాత్రా : అతని భార్య, 30 వత్సరముల వయస్సు.

నికోలాయ్‌స్ట్రాబొటోవ్ : అతని తమ్ముడు, 30 వత్సరములప్రాయం ప్రాసిక్యూటింగు అటార్నీ.

సింజోవ్ : గుమాస్తా.

పొలోగీ : గుమాస్తా.

కాన్ : మాజీ సైనికుడు.

గ్రికోవ్ :
లెవ్‌షిన్ :
యగోడిన్ : } కార్మికులు
రయాబట్‌జోవ్ :
అకిమోవ్ :

అగ్రఫీనా : గృహనిర్వాహకురాలు.

బొబోయ్‌డోవ్ : పోలీసు కెప్టెన్.

క్వాష్ : కార్పొరల్.

ఇంకా - ఒక లెఫ్టినెంటు, పోలీసు చీఫ్, ఒక పోలీసు, సైనికులు, కార్మికులు, గుమాస్తాలు, నౌకర్లు.

# శత్రువులు

## మొదటి అంకము.

[ఒక పెద్ద తోట. అందులో బ్రహ్మాండమైన నిమ్మచెట్లు నీడలు కమ్ముతూంటాయి. లోపలి భాగంలో ఒక తెల్లటి సైనిక గుడారం. చెట్లకింద దక్షిణదిశగా ఒక పచ్చిక దిబ్బ. దానిముందు ఒక మేజాబల్ల. చెట్లకింద యెడమ వైపున ఒక పెద్ద భోజనాల బల్ల. దానిముందు పేము కుర్చీలు. ప్రక్కగా నీరు మరుగుతూంటుంది. ఒక చెట్టు నీడను కాన్ నింబడి పైపు గొట్టంతో పొగ పీలుస్తో, పొలోగీతో మాట్లాడుతూంటాడు]

పొలోగీ: (వికారంగా అభినయిస్తూ) ఔను, వాస్తవమే; మీరు తెలిసినవారు. నేను, ఊరూ పేరూ లేని అనామకుణ్ణి. పనికిమాలినవాణ్ణే అయినా ప్రతి దోసపాదూ యీ నా చేతుల్తో పెట్టి, పెంచి, కాపించాను. ఒక్క దోస కాయనైనా సరే నాతో చెప్పకుండా యెవ్వరూ దొంగిలించకూడదు.

కాన్: (చిర చిరలాడుతూ) నీ ఆజ్ఞ నెవ్వరూ పొందలేరు కాబోలు!

పొలోగీ: (అరచేతిని గుండెలపైన అదుముకుంటూ) వినండి! మీ సొత్తు నెవరైనా తస్కరిస్తే, రక్షణ కోరుకునే హక్కు ఉందంటారా, లేదా?

కాన్: న్యాయస్థానానికి పోయి అడుగు. ఇంకా చూస్తావేం! ఈ రోజున నీ దోసకాయలు కాజేశారు: రేపు నీ

బ్రే మాయం చేయగలరు. నీకు రక్షణ యిచ్చేందుకు న్యాయ చట్టాలు వున్నాయిగా!

శాలోగి: కానీ .... మీ మాటలు నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. పైగా ప్రమాదం కూడా. మీరు.... సైన్యంలో పనిచేసి విరమించుకున్న సైనికులు. పైగా సెంట్ జార్జి పతకం పొందినవారు. మీరే న్యాయ శాస్త్రాలను గురించి అలక్ష్యంగా మాట్లాడితే మా బోంట్ల గతి యేమిటి?

కాన్: మాకు న్యాయ చట్టం గిట్టం లేదు. మా కున్నదల్లా పై అధికార్ల ఆజ్ఞ! "ఎడంపక్కకు తిరుగు! ముందుకు నడు!" మన్న అధికారి ఆజ్ఞ చెవిని పడగానే తుపాకి గుండువలె దూసుకుపోవడమే. 'ఆగు!' అనగానే ఠకీ మని ఆగడమే.

అగ్రపీనా: కొలిమి గొట్టం లాగు పొగను గుప్పు గుప్పుమని వదలడం మానేస్తే బాగుంటుంది కాన్! ఆకు లన్నీ ముడుచుకు పోతున్నాయి.

శాలోగి: కడుపు మాడి ఆకలికోసం దోసకాయలు కోసుకు పోయారంటే, క్షమించి వుందును. కాలే కడుపుకు మందే కర్రలు. క్షుద్బాధ మనుష్యులచేత యెన్ని పను లైనా చేయిస్తుంది. కోటి విద్యలూ కూటికొరకే అనే సామెత వుండనే వుంది. కడుపు కక్కుర్తికి ఏ పని పైనా........

కాన్: దేవతలకు ఆకలి దప్పులే వుండవట! ఐనా సైతాన్

దైవశాసన ధిక్కారం చేశాడు.

పాలోగీ: (ఆనందంతో) యదార్థంగా అంతే! దానినే తుంటరితనం అంటున్నాను. (యాకోవ్ బార్డిన్ ప్రవేశం. తన మాటలు తానే వింటున్నట్టు అతి నెమ్మదిగా మాట్లాడుతాడు. పాలోగీ ఆయనకు నమస్కరిస్తాడు. కాన్ నిర్లక్ష్యంగా సలాం కొడతాడు.)

యాకోవ్: హలో! ఏంచేస్తున్నావ్?

పాలోగీ: జఖార్ ఇవానోవిచ్‌తో ఒక విషయం మనవి చేసుకుందామని వచ్చాను.

అగ్రఫీనా: పితూరీ చేసేందుకు వచ్చాడు. నిన్న రాత్రి ఫాక్టరీ కూలీ లెవ్వరో అతని దోసకాయలు కోసుకు పోయారట.

యాకోవ్: ఓహో; అదా విషయం! మా అన్నగారితో చెప్పుకో.

పాలోగీ: అందుకోసమే వచ్చానండీ. వెడుతున్నాను.

కాన్: (చిరాకుగా) ఇక్కడ నిలబడి గొణగడమే కాని, యెక్కడికీ కదిలే యెత్తు కనపడటం లేదే!

పాలోగీ: మీ పని యేమీ చెడగొట్టడం లేదుగా నేను. అనవసరంగా ఇతరుల జోక్యానికి పోయేవాడిని కాదు నేను. ఏ పత్రికైనా, యేదైనా మీరు చదువుకొంటూంటే నా వల్ల భంగమైతే, మీరు అనవచ్చు, నేను పడవచ్చు.

కాన్: (వెడుతూ) నువ్వు వట్టి పిసినిగొట్టు పీనుగువి. చెట్టు కింద ప్లీడరువి పాలోగీ! దోసకాయలకూ, నీ ప్రాణా

పొలోగీ: అక్రమంగా నిందిస్తున్నారు నన్ను. మానవుడికి నాలుక యెందుకు యిచ్చాడు? కష్ట నష్టాలను చెప్పుకునేందుకే.

అగ్రఫినా: ఓ! కట్టిపెడుదూ, నీ ... పొలోగీ: చెవులో జోరీగ లాగ రొద చేయడమేనా పని?

యూరోవ్: (రాన్‌తో) ఏం చేస్తు... డిక్కడ. వెళ్ళి పోదేం యిక్కడినుంచి?

పొలోగీ: అగ్రఫీనాతో) నా మాటలు కర్ణ కఠోరంగా వుండి, నీ హృదయాన్ని కరిగించలేకపోతే నేను నోరు మూసుకు పడివుంటానులే. (అర్థ దిద్దంగా నడుస్తూ, చెట్లను తాకుతూ వెదతాడు.)

యూరోవ్: (ఆవేదనతో) రాన్! ... నేను........మళ్ళీ........ ఎవరి మనస్సో నొప్పించేట్లు మాట్లాడేనటకాదూ?

రాన్: నిజమే ననుకుంటా నండి.

యూరోవ్: (సవారు చేస్తూ) ...! చాలా ఆశ్చర్యకరమైన విషయం. నేను త్రాగిన ప్రతి దఫా ఎవరినో ఒకరిని అవమాన పరుస్తూనే వుంటాను. ఎందుచేత రాన్?

రాన్: మామూలుగా తెలివిగా వున్నప్పటికంటె కొన్ని సమయాల్లో త్రాగి నప్పుడే మనుష్యులు యెంతో మెరుగ్గా వుంటారు. ధైర్యం హెచ్చుతుంది. ఎవ్వరన్నా భయం వుండదు. ఇది అనవచ్చు ఇది అనకూడదు అనే విచక్షణే ఉండదు. స్వ విషయంలోనూ అంతే! వెనుక మా పల్లెంలో ఒక డుండేవాడు. మైకంలేని మామూలు స్థితిలో పని పిట్టలాగు అస్తమానం నవ్వుతూ,

పేలుతూ, సాయలా పాయలాగా వుండేవాడు. గొప్ప యోధుడు, సాహసి. తాగినప్పుడు 'సోదరులారా! నేనూ మీవంటి మనిషినే! నా ముఖం మీద ఉమ్మెయ్యండి!' అంటూండేవాడు. యదార్థంగా కొందరు వుమ్మి వేసినా పల్లెత్తు మాట అనేవాడు కాదు.

యాకోవ్: నిన్ను యెవరికోనూ నేను అసభ్యంగా మాట్లాడింది?

కాన్: పబ్లిక్ ప్రాసిక్యూటరుతో. ఆయన పత్తి మట్టి బుర్ర మనిషి అన్నారు. అంతే కాకుండా వైస్టెరు భార్యకు అనేకమంది ప్రేమికులతో సంబంధ మున్నదని

యాకోవ్: చ్, చ్, చ్! ఎంత అనవసర ప్రసంగం! వాళ్ళ ప్రసక్తి నా కెందుకు చెప్పు!

కాన్: నాకేం తెలుసు? ఇంకా, అటుపైని....

యాకోవ్: సరే, సరే, కాన్! ఇక, అది చాలు! ఇంకా చాలా మందిని అవమాన పరిచేనేమో అనుకుని, గాభరా పడుతున్నాను,... దీనికంతా కారణం ఆ దిక్కుమాలిన ఓడ్కా... (బల్ల వద్దకు వెళ్ళి సీసాల వంక పరీక్షగా చూస్తాడు. ఒక పెద్ద గ్లాసులో మద్యం పోసుకొని, మెల్లగా చప్పరించడం ప్రారంభిస్తాడు. (అగ్రిఫీనా క్రీగంట అతని వైపు చూచి నిట్టూరుస్తుంది.) నే నంటే నీకు కొద్దిగా జాలిగా వుంటుంది కదూ?

అగ్రఫీనా: మీ విషయ లో ఎంతో విచారపడుతూంటాను. తక్కిన గొప్పవారిలా కాదు మీరు! అందరికోసు

హృదయం విప్పి, సహజంగానూ సరళంగాను ప్రవ ర్తిస్తారు.

యాకోవ్: ఈ కాన్ యెవరిని చూచీ జాలి పడడు. అస్తమానం వేదాంతం చెబుతాడు. ఒక విషయం మాత్రం నిజం. కఠినంగా మాట్లాడి మనస్సు నొప్పించి యెవ్వ రిచేతా ఆలోచింప చేయలేం; నిజ మంటావా, కాదా కాన్?

("ఎయి, కాన్!" అంటూ సేనాధిపతి పిలుపు గుడా రంనుంచి వినపడుతుంది.) చాలా కఠినంగా అదుపు ఆజ్ఞల్లో పెట్టి ఉంటారనుకుంటాను నిన్ను కాన్!

కాన్: (వెడుతూ) ఆ సేనాధిపతిని చూస్తేనే చాలు, నాబుర్ర చెడిపోయి, కొయ్యబారి పోతాను.

సేనాధిపతి: (గుడారం నుంచి వెలుపలికి వస్తూ) కాన్! నదికి! బలే హాయిగా వుంది!

(వాళ్ళిద్దరూ తోట నుంచి నదికి వెడతారు.)

యాకోవ్: (ఒక కుర్చీమీద కూర్చుండి, ముందుకూ వెనుకకూ ఊగుతూ) మా ఆవిడ యింకా నిద్రలేవలేదూ?

అగ్రఫీనా: ఆఁ, లేచారు. లేచి, ఏట్లో ఈది వచ్చారు అప్పుడే.

యాకోవ్: ఐతే, నాపై నీకు జాలి వుందన్నమాటే!

అగ్రఫీనా: మీరు మందు పుచ్చుకుని ఆరోగ్యవంతు లవ్వాలి!

యాకోవ్: సరే, కాగ్నాక్ సారాయిచుక్క పోసియ్యి.

అగ్రఫీనా: యాకోవ్ ఇవానోవిచ్చి తాగుడు తగ్గిస్తే మంచిది.

యాకోవ్: ఎందుకు మానాలి? ఒక్కసారి సారాయి యివ్వడం

మా_న్తే నాకు కలిసి వచ్చేదేముంది?
(అగ్రఫీనా నిట్టూర్చి ఒక పెద్ద గ్లాసునిండా కాగ్నిక్ మద్యం పోసి యిస్తుంది. మైఖేల్‌స్కాక్రిబొటోవ్ వేగంగా వస్తాడు. చాలా కంగారుగా వుంటాడు. కొన దేరిన నల్లని గడ్డాన్ని వ్రేళ్ళతో సరితీసి, రెండవ చేతితో టోపీని ఆడిస్తుంటాడు.)

మైఖేల్: జఖార్ ఇవానోవిచ్ లేచారా? ఇంకా లేవలేదూ? అనుకున్నంతా అయింది. నాకు.... చల్లటి పాలు ఉన్నాయా? అభినందనాలు. సుప్రభాతం! యాకోవ్ ఇవానోవిచ్! ఈ విషయం విన్నారా? ఆ తుంటర్లు మన ఫోర్మన్ డిష్కోవ్‌ను పనిలోనుంచితీసివేయమని అడుగుతున్నారు. వీళ్ళ కేమి పోయేకాలం వచ్చిందో కాని, పని నుండి తీసివెయ్యకపోతే వాళ్లందరూ సమ్మెకడతామని బెదిరిస్తున్నారు.

యాకోవ్: ఇంకా చూస్తారేం? వెళ్ళి తీసివెయ్యండి.

మైఖేల్: దానికేం, బహు చులాగ్గా తీసివెయ్యవచ్చును....కాని, చూడండి! అసలు విషయం అదికాదు. వాళ్లు కోరినట్లు చేయడం మొదలుపెడితే నెత్తి కెక్కుతారు. నేడు ఫోర్మన్‌ని తీసివెయ్యమన్నారు. రేపు వాళ్ళ ఆ వందం కోసం ఏ చెట్టు కొమ్మకో మెడకు తాడు పోసుకుని నన్నే ఉరితీసుకొమ్మంటారు. అదీవిషయం

యాకోవ్: (నెమ్మదిగా) ఈ కోరిక కోరేందుకు రేపటి వరకు ఆగుతా రనేనా మీ వుద్దేశం?

మైఖేల్: మీ కీ విషయం పరిహాసాస్పదంగా కనపడుతున్న ట్టుంది. ఆ మందగులతో మీరు వ్యవహరిస్తే, చూడాలని కుతూహలంగా వుంది నాకు. ఒకరా, యిద్దరా? వెయ్యిమంది! అనేక రకాల మనుష్యుల దుర్బోధనలు మీ ప్రియ సోదరుల ఉదార వాదం, ఇతర ఆందోళనాపరుల కరపత్రాల ఫలితంగా బుర్రలు తిరిగి వున్నారు. (చేతి గడియారం చూస్తాడు.) అప్పుడే పది గంటలౌతోంది. మధ్యాహ్నం భోజనాల తరవాత జవాబిస్తామని బెదిరిస్తున్నారు. నిజం చెబుతున్నాను యాకోవ్ గారూ! యీ అలగా జనమంతా రెచ్చిపోయేందుకు కారణం మీ అన్నగారే! నేను పట్టణంలో లేని సమయంలో మీ అన్న చేసిన నిర్వాకంతో, ఆయన మెత్తదనాన్ని కూలీలు అలుసు తీసుకుని, నెత్తి కెక్కుతున్నారు. భయ భక్తులు లేకుండా మితిమీరి పోయారంటే నమ్మండి.

(ఎడమ ప్రక్కనుండి సింజోవ్ ప్రవేశిస్తాడు. ముప్పది సంవత్సరాల ప్రాయం. అతని గంభీర వదనం చూపరుల దృష్టి నాకర్షిస్తూంటుంది.)

సింజోవ్: మైఖేల్ వాస్సిలోవిచ్! కార్మిక ప్రతినిధులు కార్యాలయంలోకి వచ్చి, యజమానులను చూడగోరుతు

మైఖేల్: ఏమిటి! చూడగోరుతున్నారూ? దయచేసి వారిని ఏట్లో

దిగమను. (ఎడమ ప్రక్కనుంచి పౌలీనా ప్రవేశి స్తుంది.) క్షమించండి, పౌలీనా!

పౌలీనా: (సౌమ్యంగా) బాగా తిట్టడం అలవాటయిపోయిందే, మీకు? మీ ఆగ్రహానికి కారణం?

మైఖేల్: కోపకారణమా? ఇంతకు పూర్వం నాకు "భక్తిపూర్వ కమైన విజ్ఞప్తులు చేసుకునే యీ కూలీలు - శ్రామిక వర్గం ఇప్పుడు నన్ను ఆజ్ఞాపిస్తున్నారు.

పౌలీనా: చూడండి! యీ కూలీలతో మీ రింత కఠినంగా ప్రవ ర్తించకూడదని నా వుద్దేశ్యం.

మైఖేల్; (చేతులతో వ్యర్థ సంజ్ఞ చేస్తూ) అసలు విషయం అదీ!

సింజోవ్: ప్రతినిధులతో ఏమని చెప్పమంటారు?

మైఖేల్: ఆగమను! కొంపలు మునుచుకుపోవడం లేదులే! వెళ్లు.

పౌలీనా: ఈతని ముఖం చాలా ముచ్చటగా వుంది! మన వద్ద చాలా కాలంనుంచీ పని చేస్తున్నాడా?

మైఖేల్: ఒక సంవత్సరంనుండి అనుకుంటాను.

పౌలీనా: పెద్ద యింటి బిడ్డలాగా -మర్యాదస్థుడిలాగు కనిపిస్తు న్నాడు. ఎవడేమిటి వీడు?

మైఖేల్: (పెదవి విరచి) నెలకు నల్భై రూబుళ్ళ జీతం (గడి యారంవంక చూచి, నిట్టూర్చి, ప్రక్కలకు చూడగా పొలోగీ కంటబడతాడు.) ఏయ్! నువ్విక్కడ యేం చేస్తున్నావ్? నన్ను చూచేందుకు వచ్చావా?

పొలోగీ: లేదండీ, మైఖేల్ వాసిలీవిచ్! జఖార్ ఇవానోవిచ్ దర్శ

నం చేసుకుందామని వచ్చాను.

మైఖేల్: ఎందుకు?

పొలోగి: ఆస్తి హక్కుల అతిక్రమణ సందర్భంలో.

మైఖేల్: (పౌలీనాతో) ఒక కొత్త పనివాణ్ణి మీకు పరిచయ పరుస్తాను. ఈ మనిషికి తోట పని అంటే గొప్ప అభిరుచి వుంది. ప్రపంచంలో ప్రతి వస్తువూ తన ప్రయోజనాలను నష్టపరిచేందుకే సృష్టింపబడిందని యితడి గాఢ విశ్వాసం. ఒక టేమిటి, కనపడే ప్రతిదీ యీతడికి పీడాకరంగా కనిపిస్తుంది. ఈ సూర్యుడు, ఇంగ్లండు, కొత్త యంత్రాలూ, కప్పలూ....

పొలోగి: (మందహాసంతో) బెక బెకమని రొద ప్రారంభించ గానే-ఒక్క యితడికేనేమిటి - కప్పలంటే అందరికీ విసుగు పుడుతుంది.

మైఖేల్: ఆఫీసుకు పో! పని మానుకొని చీటికీ మాటికీ పితూ రీలు చేసే నీ స్వభావం నాకు రోత కలిగిస్తోంది. తక్షణం వెళ్ళి పనిచేసుకో.

(పొలోగి వంగి సలాంచేసి వెళ్ళిపోతాడు. పౌలీనా మందహాసం చేస్తూ అతనివైపు చూస్తుంది.)

పౌలీనా: ఎంత కఠినంగా వుంటారండీ మీరు? అతడు వింత రకం మనిషి. మన రష్యా ప్రజలు పర దేశీయు లందరికంటె విలక్షణులుగా కనపడతారు.

మైఖేల్: ఒట్టి అడివి మనుష్యులంటే మీ అభిప్రాయంతో నేనూ ఏకీభవించి వుండేవాణ్ణి. పదిహేను సంవత్స

రాలనుండి యీ ప్రజలతో కింవా మీవా పడుతూ సత
మత మౌతున్నాను. మన పురోహితకవులు కీర్తించిన
రష్యను ప్రజల యోగ్యత, విశిష్ట లక్షణాలను గూర్చి
నాకు చక్కటి అనుభవా లున్నాయి.

పౌలీనా: పురోహిత కవులా?

మైఖేల్: అవును - మీ చెర్నీషెవిష్కీలు, డొబ్రొలుబోవులు
జ్లాటొరాట్స్కీలు, ఉస్పెన్స్కీలు (గడియారం చూసి)
జఖార్ ఇవానోవిచ్ వచ్చేందుకు యెంత ఆలస్యం
చేస్తున్నారు!

పౌలీనా: ఆలస్యానికి కారణం తెలుసునా? మీ తమ్ముడితో
నిన్న రాత్రి ప్రారంభించిన చదరంగపు ఆట ఇప్పుడు
పూర్తి చేస్తున్నారు.

మైఖేల్: ఆహా, అదా కారణం, చెప్పారుకాదు! మధ్యాహ్నపు
భోజనాల తరువాత ఫాక్టరీ పని పట్టిపెడతామని బెద
రిస్తున్నారు. ఈ రష్యా దేశానికేదో కీడు మూడనై
యుం దనే మాట యదార్థం. నా మాట నమ్మండి!
భయమా, భక్తా? అరాచకం ప్రబలిపోతోంది. పని
పాటలు యెగవేసేందుకు సాకులు వెతుకుతూంటారు
కూలీలు. ఇక ప్రభుత్వం సంగతి చూద్దామా అంటే
శాంతి భద్రతలను కాపాడలేని అసమర్థతలో వుంది.
ప్రభుత్వ మంటేనే భయం నశిస్తోంది ప్రజలకు....

పౌలీనా: అది సహజమే. ప్రజా భక్షణ చట్టాల నమలు జరిపే
ప్రభుత్వంపై భక్తి నశించదూ? మనదో మన మాట.

మన ప్రభుత్వం........

మైఖేల్: ఔను, నిజమే. నే నెవ్వరినీ సమర్ధించడం లేదు. ప్రభుత్వాన్ని కూడాను. ఆంగ్లో శాక్సనులసంగతి చూడండి! (జఖార్ బార్డిన్, నికోలాయ్, స్కాగ్రిబొటోవ్‌లు ప్రవేశిస్తారు.) ప్రభుత్వాన్ని నిర్మించేందుకు వారికంటె మంచి ముడిసరుకు దొరకదు. ఇంగ్లీషు వాడు సర్కస్ గుర్రంవలె చట్టంముందు సాష్టాంగపడి దండ ప్రణామాలు చేస్తూంటాడు. ప్రభు భక్తి వాడి నరాల్లో ప్రవహిస్తూంటుంది. సుప్రభాతం జఖార్ ఇవానోవిచ్! హలో నికోలాయ్! కూలీలతో మీ రింత వరకూ చూపిన ఔదార్యానికి ఫలితం విషయం చెబుతాను, వినండి! తక్షణం డిష్కోవును నేను పనిలో నుంచి తొలగించాలట! లేకపోతే సమ్మె చేస్తారట.... ఈ సంగతి బాగా నచ్చిందా మీకు?

జఖార్: (నుదురు నొక్కుకుంటూ) నాకా?.... హుఁ ........ డిష్కోవ్! మాటి మాటికీ రుస్సు బుస్సు మంటూ, కూలీలను కొట్టేవాడేనా? ఆడ పిల్లలతో కూడా ఏవో గొడవలు చేస్తూనే వుంటాడు. తీసివెయ్యడమే మంచి దని నా వుద్దేశ్యం. న్యాయ సమ్మతంగా కూడా వుంటుంది.

మైఖేల్: (కస్సుమంటూ) ఆరి భగవంతుడా! ఈ సంగతిని గూర్చి జాగ్రత్తగా ఆలోచించాలి. గౌరవనీయులైన భాగస్వామిగారూ! ఇది న్యాయ విషయం కాదు,

వ్యాపార సంబంధం! ........న్యాయంసంగతి- సమా
చారాలు చూసుకోవలసింది నికోలాయ్, న్యాయస్థాన
మూను. మీ న్యాయ దృష్టి మన వ్యాపారానికి చాల
ముప్పు కలిగిస్తోందని, మరొక పర్యాయం మీ దృష్టికి
తేవలసి వచ్చినందుకు క్షమించాలి.

జఖార్: క్షమించండి, మీ వాదన సత్యాభాస!

పౌలీనా: నా యెదుట కూడా, ఉదయం లేచింది మొదలు
యిప్పటివరకూ వ్యాపారపు గొడవలే!

మైఖేల్: వెయ్యి క్షమార్పణలు చెప్పుకుంటాను గాని, యీ
విషయంలో తాడో పేడో తేల్చుకోవలసిందే! ఈ
ఫాక్టరీ నిర్వహణను మీపై పెట్టి దేశాంతరం వెళ్ళే
ముందు యీ ఫాక్టరీనంతా యిట్లా గుప్పిటిలో
నొక్కిపట్టి వుంచాను. (పిడికిలి బిగించి చూపుతాడు.)
ఈ చుట్టుప్రక్కల తొంగిచూచేందుకుకూడా యెవరూ
సాహసించలేకపోయారు. మీరు నెలకొల్పిన ఆదివా
రపు వినోద కాలక్షేపాలు, వార్తా పత్రికా పఠనం వగైరా
లాలు మన దేశంలో మన పరిస్థితులకు అనుకూలిం
చవు. ముందునుండీ నేను వీటికి వ్యతిరేకమని చెబు
తూనే పున్నాను. సంస్కార విహీనమైన మన రష్యన్
మెదడుపై విజ్ఞాన కణాలు పడి, ప్రజ్వరిల్లి యుక్తా
యుక్త విచక్షణా జ్ఞానమనే తేజస్సు నియ్యవు. ఊరికే
రాజుకుంటూ పొగలు కక్కుతూంటుంది. అంతే!

నికోలాయ్: ఇంత ఆవేశం యెందుకు? శాంతంగా సావధానంగా

మాట్లాడుకోవాలి.

మైఖేల్: (ఆగ్రహో న్నణచుకొంటూ) నీ సలహాకు చాలా కృత జ్ఞుణ్ని చాలా అమూల్యమైన సలహా. ఐతేనేమి. నేను మాత్రం ఆమోదించలేను. ఆరు నెలల్లో- జఖార్ ఇవా నోవిచ్!-కార్మికుల యెడ మీరు చూపిన ఔదార్య ప్రవ ర్తన ఎనిమిదేండ్లు కష్టపడి నేను నెలకొల్పిన గట్టి కట్టడాన్ని పునాదులకంటా కదిల్చివేసింది. కూలీల భయభక్తుల్ని చూరగొన్నాను నేను. నా పేరు చెబితే గజ గజలాడిపోయేవారు. నన్నే యజమాని కింద మాచుకునేవారు. కాని, ప్రస్తుత స్థితి చూడండి! వా ళ్ళకీ తెలిసిపోయింది, యిక్కడ యజమాను లిద్దరనీ, అందులో ఒకరు ఉదార స్వభావుడనీ, రెండవ వారు దుష్టులనీని! విడబరచి చెప్పవలసిం దేముంది. మీరు సుజనులు, నేనో క్రూరుణ్ణి!

జఖార్: (కలవరపడుతూ) అబ్బెబ్బే........ఇలా మాట్లాడుతు న్నారేమిటి?

పోలీనా: చాలా వింతగా మాట్లాడుతున్నారు మైఖేల్!

మైఖేల్: ఈ విధంగా మాట్లాడేందుకు కారణా లున్నాయి. ఈ ఫాక్టరీలో న న్నెందుకూ పనికిమాలిన పరిస్థితుల్లో పెట్టారు మీరు. వెనుకటి పర్యాయం యీ ప్రశ్నే వచ్చినప్పుడు డిష్కోవ్‌ను తీసివేసేకన్నా, ఫాక్టరీనన్నా మూసేస్తానని ఢంకా బజాయించి చెప్పివేశాను. నేను చెప్పినంత పనీ చేసే షటాన్నని గుర్తించి కూలీల

నోరు మూసుకుని పడివున్నారు. శుక్రవారంనాడు గ్రికోవ్‌తో, యీ డిష్కోవు పొగరుబోతనీ, పనినుంచి తీసివేస్తాననీ మీరు చెప్పారటగా జఖార్ ఇవానోవిచ్!

జఖార్: (సానునయంగా) ఒక్క విషయం ఆలోచించండి! అందర్నీ చెంపలు బ్రద్దలు కొడుతూ బూటు కాళ్ళతో తన్నుతూ, కారు కూతలు కూస్తూ, తిరుగుతూండే వాడు! ఇలాంటి తుంటరి పనులు మనఫాక్టరీలో జరుగనివ్వకూడదు. మనం యూరపియన్లం! నాగరికులం!

మైఖేల్: అన్నిటికన్నా ముందు, మనం ఫాక్టరీ స్వంతదార్లం! ప్రతి శలవురోజునా కూలీలు తాగి తందనా లాడుతూ, ఒకరి నొకరు కొట్టుకొంటున్నారు. మనకు సంబంధమేమున్నది? ప్రస్తుతానికి వాళ్ళకి మంచి నడవడిక బోధించడం మీరు మానాలి. వాళ్ళ ప్రతినిధు లిప్పుడు డిష్కోవును తీసివెయ్యమని అడిగేందుకు ఆఫీసులో కూర్చున్నారు. ఏమి చెయ్యదలచుకున్నారు?

జఖార్: ఈ డిష్కోవ్ మన పనిలో తప్పనిసరిగా ఉండాలనే మీ అభిప్రాయం?

నికోలాయ్: (వెటకారంగా) నాకు అర్థమైనంత వరకూ, ఈ విషయం వ్యక్తులకు కాక సిద్ధాంతాలకు సంబంధించినదిగా తోస్తోంది.

మైఖేల్: సరిగా అంతే! ఈ ఫాక్టరీ యజమానులు మీరూ, నేనూనా? లేక యీ కూలీలా? అదీ ప్రశ్న.

జఖార్: (తోచక) ఔను, నాకూ బోధపడింది కాని........

మైఖేల్: ఇప్పుడు మనం లొంగిపోతిమా, ఇక మీదట వీళ్లు కోరే కోరికలకు అంతం వుండదు. సిగ్గూ యెగ్గూ లేని తుంటర్లు. ఆరునెలల కాలంలో మీ ఆదివారపు బడులూ, బోధనా తరగతులు పరిస్థితులను తారుమారు చేవేశాయి. న న్నొక తోడేలు గుంపులాగు చూస్తు న్నా రీకూలీలు. అప్పుడే కొన్ని కరపత్రాలు కూడా పంచారు. వాటినిండా సోషలిజంకంపు కొడుతోంది. ఔను, వీళ్ళ వ్యవహారం బాగా ముదిరింది.

పౌలీనా: ఈ మారుమూల ప్రదేశంలో సోషలిజమా? చాలా పరిహాసాస్పదంగా కనిపిస్తోంది!

మైఖేల్: గాడిద పిల్ల కోమలం అన్నట్లు మీరు చేసిన పని మొదట్లో చిన్నపిల్లల్ని ముద్దు చేసినట్లుగానే వుంది. కాని, అదే వరుసగా తొండ ముదిరి ఊసరవెల్లిఅయి కూర్చుంటుంది.

జఖార్: ఫాక్టరీ మూసివేద్దాం. కొన్ని రోజులు కడుపు మాడితే మనుష్యులు చల్లబడతారు (యాకోవ్ లేచి నెమ్మది గా బల్లవద్దకు వెళ్ళి, ఒక గ్లాసుడు మద్యం సేవించి, బయటకు వెడతాడు.) మనం మూసివేయగానే ఇంట్లో పెళ్ళాం బిడ్డల గోల, పోరు హెచ్చుతుంది. కలలతో మత్తెక్కిన మనుష్యులకు ఆడవాండ్ర కన్నీటి చుక్కలు అమ్మోనియా ఉప్పులాగు గుప్పున ప్రాణేం ద్రియానికి తగిలి నసాళానికి అంటుతుంది. అప్పుడు మత్తు వదలిపోతుంది.

పొలీనా: చాలా కఠినంగా మాట్లాడుతున్నారండి!

మైఖేల్: ఔను, కఠినమే. జీవితంలో కఠినంగా వ్యవహరించక తప్పదు!

జఖార్: కాని........ ఇంతమందికి కష్టం కలిగించే పని.... తప్పని సరిగా చేయాలంటారా? నా మన స్పొప్పడం లేదు........ఇంత పని అనవసర........

మైఖేల్: పోనీ మీ రింకొక పద్ధతి చెప్పగలరా?

జఖార్: నేను పోయి మాట్లాడి చూస్తే?

మైఖేల్: వాళ్ళ ముఖాలు చూడగానే మీరు మెత్తపడి లొంగి పోతారు, నా పరిస్థితి యీ ఫాక్టరీలో దుస్సహమై పోతుంది. మీ ఊగిసలాట, దిగజారుడు విధానమూ నాకు అవమానకరంగా ఉన్నాయి. ఇట్లా అంటోన్నం దుకు క్షమించండి. మీ పద్ధతి బహు ప్రమాద భూయిష్టం!

జఖార్: (ఉద్రేకంతో) నువ్వు చెప్పినదానికి అడ్డు తగలడం లేదయ్యా నేను! ముందు వెనుక లాలోచిస్తున్నా నంతే! నేను పల్లెటూరి భూస్వామిని. నాలో యింకా పారిశ్రామిక యజమాని తత్వం జీర్ణించ లేదు. ఈ తతంగ మంతా నాకు బహు కొత్తగాను, చిక్కులతో కూడుకున్నట్లు కనపడుతోంది. స్వతహాగా న్యాయం జరపాలని వాంఛిస్తాను. కార్మికుల కంటె కర్షకులు యెక్కువ శాంతి కాముకు, మంచి వాళ్లు. వాళ్ళతో పొర - పొచ్చెం లేకుండా బహు సౌమ్యంగా గడచి

పోయింది. ఈ కూలీల్లో కూడా, సరళమైన స్వభావం కలవారు లేకపోలేదు. ఐనా మొత్తంమీద, వాళ్లు దురభిమానులని మీతో ఏకీభవించక తప్పదు. పేచీ కోర్లే!

మైఖేల్: మీరు వాళ్ళ కెన్నో వాగ్దానాలు చేసి, ఆశలు కల్పించినప్పటినుంచీ మితి మీరిపోయారు.

జఖార్: కాని మీరు ఒక్క విషయం గమనించాలి. మీరు వెళ్ళిన తరవాత వారిలో అశాంతి ప్రబలడం గుర్తించాను. గలాటాలు కూడా చేయ సాగేరు. బహుశా నేను ప్రమత్తతతో మెలగడమే, దీనికి కారణమై ఉండవచ్చును. ఐతేనేమి వారిని శాంతపరచ వలసి వచ్చింది. పత్రికల నిండా మనల గూర్చి నిందా పూర్వకమైన వ్రాతలు ప్రకటింపబడజొచ్చాయి .... అందులో కొన్ని మరీ కటువుగా ఉన్నాయి.

మైఖేల్: (తొందరతో) అప్పుడే పదిగంటల పదిహేడు నిమిషా లైంది. ఎదో ఒక నిర్ణయానికి జరూరుగా రావలసి వుంది. నాకు సంబంధించినంత వరకూ యీ ఫాక్టరీని మూసివేయక పోతే నేను రాజీనామా నిచ్చివేస్తాను. ఫాక్టరీ మూసివేసినా మనకు నష్ట మేమీ లేదు. ఆ సందర్భంలో తగు కట్టు దిట్టాలు చేశాను. తక్షణం సప్లయి చేయవలసిన సరుకే కాకుండా, మన సామాను కొట్లనిండా చాలా కాలం సరిపడేటంత సరుకు నిలవవుంది.

జఖార్: హాఁ....మ్ సరే, కనపడుతోనే వుంది. ఏదో నిర్ణ యం తక్షణం చేసి తీరాలి. వ్యవధి లేదు. మీ రేమం టారు, నికోలాయ్ వాసిలీవిచ్?

నికోలాయ్: మా అన్నగారు చెప్పిందే మంచి మార్గ మనుకుం టాను. నాగరికత అంటే మనకు విలువ ఉంటే, కొన్ని సూత్రాలకు బద్ధులమై వుండాలి.

జఖార్: అంటే మీ వుద్దేశం కూడా ఫాక్టరీని మూసివేయాలనే నన్నమాట! ఎంత విచారకరమైన విషయం! మైఖేల్ వాసిలీవిచ్! అన్యథా భావించకండి. నా అభిప్రాయం ఒక్క పది నిముషాల్లో తెలియపరుస్తాను, సరేనా!

మైఖేల్: సరే.

జఖార్: (ఎడమ దిక్కుగా వేగంగా వెడతాడు.) పౌలీనా! ఇట్లా నాతో రా.

పౌలీనా: (భర్త వెనుక వెడుతూ) ఓరి భగవంతుడా! ఆఖరికి యీ విషయం చిలికి చిలికి గాలివాన అయిందే.

జఖార్: తర తరాలుగా రైతులకు భూ స్వామంరుల యెడల అపారమైన భయ భక్తు లున్నాయి.

(వా రిద్దరూ నిష్క్రమిస్తారు.)

మైఖేల్: (పళ్లు కొరుకుతూ) ఒట్టి జాలి గుండె వాడు. పిరికి పంద! దక్షిణ రష్యాలో రైతులు తిరుగబడి భూస్వా ముల్ని చిత్రవధ చేసిన తరవాత కూడా, యెట్లా మాట్లాడుతాడో చూడు!

నికోలాయ్: శాంతంగా వుండు మైఖేల్! అంత తొందరపాటు యెందుకు?

మైఖేల్: నా నరాల పటుత్వం సడలిపోయింది. నేను ఫాక్టరీకి వెడుతున్నాను....చూడు! (తన జేబులోంచి ఒక రివాల్వరు తీస్తాడు.) ఈ శుంఠ మూలకంగా ఆ కూలీలందరికీ నాపై ద్వేషం కలిగింది. దీనికి ఝడిసి వీళ్లకి లొంగిపోను. లొంగితే, నన్ను నిందించేవారిలో నువ్వే ప్రథముడ వౌతావు. మన సర్వస్వమూ యీ ఫాక్టరీలో పెట్టివేశాం.....నేను ఒక్క క్షణం ఏమరుపాటుతో వుంటే యీ బట్టతల బడుద్ధాయి సర్వనాశనం చేసి వేస్తాడు.

నికోలాయ్: (శాంతంగా) నువ్వు చెప్పేదాంట్లో అతిశయోక్తి లేకపోతే పరిస్థితి శృతి మించినట్లే తోస్తోంది.

సింజోవ్: కూలీలు మిమ్మల్ని పిలవమంటున్నారు.

మైఖేల్: నన్నా? ఏం కొంప మునిగింది?

సింజోవ్: ఈ భోజన సమయానంతరం ఫాక్టరీ మూసివేస్తారని వదంతిగా వుంది,

మైఖేల్: విన్నావా అది? వాళ్ళ కెట్లా తెలిసింది?

నికోలాయ్: బహుశా యాకోవ్ ఇవానోవిచ్ యీ వార్త జేరవేసి వుంటాడు.

మైఖేల్: పీడ దుంప తెగ! (కోపంతో సింజోవ్‌వైపు చూస్తూ) యీ విషయంలో ఇంత శ్రద్ధ చూపుతున్నా వెందుకు సింజోవ్? ఇక్కడకు పదే పదే వస్తున్నావు, ప్రశ్నలు

వేస్తున్నావు.... నీ ఉద్దేశ్యం ఏమిటయ్యా?

సింజోవ్: గుమస్తా మిమ్మల్ని పిలుచుకు రమ్మని పంపించాడు,

మైఖేల్: చెప్పావు కదూ! ఆ మూతి అట్లా పెట్టా వెందు కయ్యా! ఈ అలవా టెప్పణ్ణుంచీ? మహా సంతో షంగా వున్నట్టుందే నీకు? నీ ఉల్లాసానికి కారణం?

సింజోవ్: అది నా స్వభావ మనుకుంటాను.

మైఖేల్: నా కింకో విధంగా తోస్తోంది. ఇక ముందు, నేనంటే భయ భక్తులతో మెలగమని సలహా యిస్తున్నాను, వినపడుతోందా?

(సింజోవ్ రెప్ప వేయకుండా చూస్తూంటాడు.)

మైఖేల్: సరే, ఇంకా యెందుకు నిలబడ్డావ్?

తాత్యానా: (కుడివైపు నుంచి ప్రవేశిస్తూ) ఓహో, డైరెక్టరు ఇక్కడున్నారూ! చాలా తొందర పనిమీద వున్నారా? హల్లో! మట్వీ సింజోవ్!

సింజోవ్: (స్నేహార్ద్ర స్వరంతో) సుప్రభాతం! అలసటగా లేదూ మీకు?

తాత్యానా: లేదు, అలసిపోలేదు. తెడ్డు వేయడం వల్ల నా దబ్బలు మాత్రం నొప్పి పెడుతున్నాయి. మీరు ఆఫీసుకు వెడుతున్నారా? నేను కూడా గుమ్మం వరకూ వస్తాను. మీతో ప్రస్తావించ దలచుకున్న విషయం మీకు తెలుసునా?

సింజోవ్: నా కెట్లా తెలుస్తుంది?

తాత్యానా: (సింజోవ్ ప్రక్కనే నడుస్తూ) నిన్న మీరు చెప్పింది

చాలవరకు యుక్తి యుక్తంగా వుంది. అంతే కాకుండా మీ వాదన యెక్కువ ఉద్రేక పూరితంగా వుండి, సిద్ధాంతాలయందు మీకు గల గాఢ విశ్వాసాన్ని వెల్లడిస్తోంది. ఉద్రేకపు పాలు తగ్గితే, అనేక ఉపన్యాసాలు యింకా అనేక రెట్లు మనస్సుకు నచ్చుతాయి. (వారు దూరం వెళ్ళినకొలదీ సంభాషణ విన పడదు.)

నికోలాయ్: ఈమె చాలా వింత మనిషి. రూపు రేఖా విలాసాలు గలయువతి. ఐనప్పటికీ దమ్మిడీకి కొరగాని దరిద్ర నారాయణునితో కథ నడువుతోంది. షోకిల్లాయేగాని, తెలివి తక్కువ మనిషి.

మైఖేల్: (అపహాస్యంగా) ప్రజాస్వామికమండీ! ఆమె ఒక పల్లెటూరు బడి పంతులు కూతురు! అందుచేత ప్రజా సామాన్య మంటే ఆమెకు అభిమానం మెండట!.... ఈ పల్లెటూరు పెద్ద మనుష్యులతో లంకె యెందుకు యేర్పరచుకొన్నానో, నాకే అర్థం కావడం లేదు.

నికోలాయ్: ఏమి నష్ట పడ్డావు లెద్దూ? ఈ వ్యాపారాని కంతా నీవే యజమానివి!

మైఖేల్: ఇక నౌతాను, ఇంతవరకు కాదు.

నికోలాయ్: ఆమెను లోబరచుకోవటం చాలా సుఖ వనిపిస్తోంది. మదించి వున్నట్లు తోస్తోంది.

మైఖేల్: ఈ ఉదార వాది ఎక్కడ పాతుకుపోయాడు? మళ్ళీ పడుకొని నిద్రపోతున్నాడేమో! అబ్బే! యీ రష్యా

కు మోక్షం లేదండీ! ఎప్పటికీ బాగుపడదు. హెచ్చు తగ్గులు గమనించకుండా ప్రజ లందరూ కలిసిపోతు న్నారు. ఏ ఒక్కరూ వాళ్ళ స్థితి గతుల ననుసరించి నడచుకోవడం లేదు. సర్వం జగన్నాధం అయిపో యింది. ప్రతివాడూ కలలు కనడం, నోటికి వచ్చిం దల్లా వాగడం, ఇంతే పని. ఇక ప్రభుత్వం సంగతి చూద్దామా అంటే, అందులో అందరూ బృహస్పతులే చేరారు. ఓ అంటే ధం అనలేని ఘంఠలు. ఒక్కడికీ నిజాయితీ లేదు. పదవీ వ్యామోహం, ధనాశ, పార్టీ తత్వాలూ ప్రబలిపోయాయి. ఒట్టి అసమర్థులూ, స్వార్ధ పరులూను.

తాత్యానా: ఎందుకు మీ రంత గట్టిగా అరుస్తున్నారు? ఎందుకో గాని అందరూ గొంతుకలు చించుకుంటున్నా రీపూట.

అగ్రఫీనా: మైఖేల్ వాసిలీవిచ్! జఖార్ పిలుస్తున్నారు.

మైఖేల్: ఎంత సేపటికి! ఎంత సేపటికి!!

తాత్యానా: (కుర్చీ మీద కూర్చుంటూ.) ఈయన ఇంతకంగారుగా ఉన్నా రెందుకు?

నికోలాయ్: ఈ విషయా లాట్టే సరదా కలిగించవు లెండి!

తాత్యానా: (నెమ్మదిగా) మీ అన్నను చూచినప్పు డెల్లా ఒక పోలీసు జ్ఞాపకం వస్తూంటాడు. నా చిన్నతనంలో కోట్రోనాలో వేషాలు వేసేటప్పుడు, మా నాట్యశాల లో గలాటాలు జరుగకుండా చూచేవాడు. సన్నగా

పొడుగ్గా ఉండేవాడు. పత్తి కాయల్లాంటి మిడిగుడ్లు.

నికోలాయ్: వాడికీ మా అన్నగారికీ యెక్కడా పోలిక కనిపించడం లేదే.

తాత్యానా: శరీర సంబంధమైన పోలిక లున్నాయని చెప్పడం లేను. ఆ పోలీసు కూడా యెప్పుడూ వెనుక యెవ్వరో తరుముతున్నట్టే మహా హడావుడిగా వుండేవాడు. అతని లోపలనుండి ఏదో అదృశ్య శక్తి కొరడాతో కొట్టి నిలుచున్న చోట నిలువకుండా చేస్తోందా అని పించేది చూచేవాళ్ళకు. ఆ ఉరుకులూ పరుగుల్లో తన కాళ్ళకూ, ఇతర్లకూ కూడా అడ్డం పడుతూండేవాడు. పోనీ లోభత్వం కరడుగట్టిందా అంటే అదీ కనిపించదు. ప్రగాఢ లోభంతో అంతా నొల్లుకోవాలనీ, చేయవలసిన పనులన్నీ - వెంట వెంటనే - ఆఖరికి లంచాలు పుచ్చుకోవడంతో సహా ఊపిరి పీల్చుకునేందుకు కూడా తాళకుండా పరుగు లెత్తేవాడు. లంచాలు - పుచ్చుకోవడం కాదు, రెండు దోసిళ్ళతోను నొల్లుకునేవాడు. తుదకు ఆ జీవితం యెట్లా అంతమైందో తెలుసునా? కొన్ని గుర్రాలు తొక్కి చంపివేశాయి.

నికోలాయ్: ఇంతకీ మా అన్నగారి శక్తి సామర్థ్యా లన్నీ ప్రయోజన శూన్యమైన మార్గంలో ఉపయోగింపబడుతున్నాయనా, మీరు చెప్పదలచిన విశేషం?

తాత్యానా: నేను చెప్పినదాని అర్థం, ఆఖరికి ఇట్లా తేలిందా? అది

కాదు నా భావం! మీ అన్నను చూస్తే ఆ పోలీసు జ్ఞప్తికి వస్తాడు.

నికోలాయ్: మా అన్నగారి పోలిక ప్రశంసాపాత్రంగా లేదనే చెప్పాలి.

తాత్యానా: ఆయనను భూషించాలనే తాత్పర్యం కూడా లేదు, నాకు.

నికోలాయ్: మీ సరసా లాడే తీరు మరొకరికి రాదు.

తాత్యానా: నిజంగా?

నికోలాయ్: కాని, ఆహ్లాదకరంగా ఉండదు.

తాత్యానా: (శాంత స్వరంతో) మీతో ఉల్లాసంగా కాలం గడప టాని కే స్త్రీకైనా సాధ్యపడుతుందా?

నికోలాయ్: ఓహో!

పౌలీనా: ఈ రోజున ఏదీ సవ్యంగా జరగడం లేదు. ప్రొద్దుటి ఫలహారం యింతవరకూ, మెవరూ చేయనేలేదు. ప్రతి వారూ రుస రుస లాడుతున్నారు. ఈ ఉదయాన్నే క్లియోపాత్రాతో కలిసి, నాద్యా అడవికి కుక్క గొడు గుల నేరి తెచ్చేందుకు వెళ్ళింది.........నిన్నటి రోజు న యిలాంటి అఘాయిత్యపు పనులు చెయ్యవద్దని గట్టిగా మందలించాను. జీవితంలో అంత కంతకు కష్టాలు హెచ్చుతున్నాయిరా, దేముడా!

తాత్యానా: మీకు తిండి ఎక్కువైంది.

పౌలీనా: ఆ మాటల ధోరణి యేమిటి, టాన్యా? మనుష్యులతో నువ్వు ప్రవర్తించే తీరు అసాధారణంగా వుంది.

తాత్యానా: నిజంగా?

పౌలీనా: ఆస్తి పాస్తులు లేకుంటే యే బాధ్యతలూ లేకుండా, పేచీ పూచీ ల్లేకుండా వుండేవాళ్ళం. పొట్ట కూటికి వేలకొలది మనుష్యులు నీ మీద ఆధారపడి వుంటే, తెలుస్తుంది.

తాత్యానా: వారిని పోషించడం మానివెయ్యండి. వారి తిప్పలు వారినే పడనివ్వండి! యీ ఫాక్టరీ, యీ భూమియూ వారికే వదలివేసి, సుఖంగా, శాంతంగా జీవించండి.

నికోలాయ్: (సిగరెట్టు ముట్టిస్తూ) ఏ నాటకంలో మాటలండీ మీరు మాట్లాడేది?

పౌలీనా: ఇట్టి విరసపు మాట లెందుకంటావో, నాకు బోధ పడటం లేదు టాన్యా! జఖార్ యెంత కంగారు పడుతున్నాడో చూస్తే తెలుస్తుంది. కూలీలు శాంతించే వరకూ తాత్కాలికంగా ఫాక్టరీని మూసివేయ నిశ్చయించాము. కాని, అది యెంత కష్టాన్ని కలిగించే పనో ఆలోచించు. పందలకొద్దీ కూలీలకు పని పాట్లు వుండవు. వాళ్ళకీ పిల్లా మేకా వుంటారు...నిజంగా ఇది చాలా దారుణమైన విషయం.

తాత్యానా: అంత దుర్భరంగా వుంటే మూసివెయ్యకండి! ఎందుకు మీ రింత బాధ పడిపోవటం?

పౌలీనా: అబ్బబ్బ! టాన్యా! ఎంత రెచ్చగొడుతున్నావూ! మేమే మూసివేయకపోతే కూలీలే సమ్మె కడతా మంటున్నారు. అప్పుడు మరీ విషమిస్తుంది.

తాత్యానా: ఏమి విషమిస్తుంది?

పౌలీనా: పరిస్థితులు. వారి కోరిక లన్నీ తీర్చడం సాధ్యం కాదు మాకు. యదార్థంగా వారికి బాధలుండి కాదు, యీ గొడవ బయల్దేర తీసింది. ఏ సోషలిస్టులో వు రెక్కి_స్తే, గంతు లేస్తున్నారు. (ఆగ్రహావేశంతో) వీళ్ళ తంతు నాకు అర్థం కావడం లేదు. ఇతర దేశాలలో సోషలిజం హద్దు పద్దుల్లో వుంది. వారి నాయకులు కూడా బహిరంగంగా, సక్రమాందోళన చేస్తారు. కాని, మన యీ దౌర్భాగ్య రష్యాలో, కూలీలను మారు మూలలకు తీసికొనిపోయి, రహస్యంగా విష ప్రచారం చేస్తున్నారు. సార్వభౌమత్వ మున్న యీ దేశంలో సోషలిజానికి తావు లేదన్న సంగతి కూడా వీరు గుర్తించరేమి? మనకు సోషలిజం కాదు కావలసింది, రాజ్యాంగ చట్టం గాని! మీ అభిప్రాయ మేమిటి నికోలాయ్ వాసిలీవిచ్!

నికోలాయ్: (చిరునవ్వుతో) మీ అభిప్రాయానికి కేవలం వ్యతిరేకం. సోషలిజం చాలా అపాయకరమైన సిద్ధాంతం. స్వతంత్ర జాతీయతత్వం లేని దేశాల్లో అది వేళ్ళు పాతుకొని, అతి వేగంగా విజృంభించేందుకు అనుకూలమయిన పరిస్థితు లుంటాయి. మన మందరమూ అతి వాదులం. అదే మన బలహీనత.

పౌలీనా: మీరు చెప్పింది నిజం. మనం అతివాదులమే!

తాత్యానా: (లేస్తూ) అందులోనూ ముఖ్యంగా మీరూ, మీ భర్తా,

ఈ ప్రాసిక్యూటరూను.

పౌలీనా: ఈ విషయాలను గురించి నీకేం తెలుసును టాన్యా? ఈ జిల్లాలో అందరూ జఖారును ఎర్రపార్టీ మని షంటారు.

తాత్యానా: (పచారు చేస్తూ) సిగ్గుతో ఆయన ముఖం అప్పు డప్పుడు యెరు పెక్కుతుంది. అది కూడా అంత తరుచుగా కా దనుకుంటాను.

పౌలీనా: టాన్యా! నీకు మతి పోయిందా యేమిటి?

తాత్యానా: మీ మనస్సుకు నొప్పి కలిగించానా? నాకు తెలియదు లెండి! మీ జీవితాలు చేతకాని కొత్త నటుల పాత్ర ధారణలాగు కనిపిస్తాయి నాకు. మీకు ఒప్పని పాత్రలు ధరించారు. ఒక్కరికీ నటనా సామర్థ్యం లేదు. నటన హాస్య భాజనంగా వుంది. యీ నాటకం యేమీ రక్తి కట్టడం లేదు.

నికోలాయ్: మీరు చెప్పినదానిలో కొంత నిజం లేకపోలేదు. ప్రతి వారూ నాటకం విసుగు పుట్టిస్తోందని ఫిర్యాదు చేస్తున్నారు.

తాత్యానా: ఔను, నిజమే. నాటకాన్ని మనం పాడుచేస్తున్నాం. పై హంగుదార్లు, పాత్రధారులూ కూడా యీ విష యాన్ని గ్రహించినట్లు తోస్తోంది.
(సేనాని, కాన్ ప్రవేశిస్తారు.)

నికోలాయ్: సంభాషణ పాఠం తప్పడం లేదూ?

సేనాని: (పిలుస్తూ) పౌలీనా! సేనానికి కొద్దిగా పాలు కావా?

లమ్మా! హో! హో! కొంచం చల్లటి పాలు!........
(నికోలాయ్‌తో) హల్లో, ఓయి పాత చట్టాల పీను
గా!........ఒనేవ్ అందాల రాణి కోడలు పిల్లా!
కరచాలనం చెయ్యి! కాన్! ఏదీ పాఠం చెప్పు! సైని
కు డనగా యెవరు?

కాన్: (విసుగుతో) పై అధికారి ఏది కోరితే, అదే దేవరా!

నేనాని: చేప అవతారం దాల్చగలడా?

కాన్: ఏ అవతారమైనా యెత్తగల సమర్ధతగలవాడే సైని
కుడు.

తాత్యానా: ప్రియమైన మామగారూ! నిన్నటి దినం యీ పాఠం
చెప్పించి మాకు చాలా వినోదం కలిగించారు. ప్రతి
దినమూ యీ తతంగం మాకు తప్పదా యేమిటి?

పౌలీనా: (నిట్టూర్చి) ప్రతి దినము, స్నానానంతరం!

తాత్యానా: ఆఁ! ప్రతి రోజూ యధావిధిగా, ప్రతి దఫా వేరు
వేరుగా మార్చి యీ ముసలి హాస్యగాడు ప్రశ్నలూ,
సమాధానాలూ కూడా తానే కల్పించి చెప్పాలి.

తాత్యానా: నీ కేమయినా ఆనందం కలుగుతుందా కాన్?

కాన్: దేవరవారికి ఆనందం కలుగుతుంది.

తాత్యానా: నీకో? నీ విషయం చెప్పు!

నేనాని: వాడికీ సరదాయే.

కాన్: ఈ సర్కస్ ప్రదర్శనం చేసి, ఆనందించే వయస్సు
నాకు మీరిపోయింది. ఐతే, కూటికొరకు కోటి
వేషాలూ వెయ్యాలి!

సేనాని: ఓరీ, ముసలి వరడూ! తిరగరా, కుడివైపు తిరుగు. ముందుకు నడు!

తాత్యానా: అస్తమానమూ యీ ముసలివానితో వేళాకోళా లాడటం మీకు విసుగు కలిగించదూ?

సేనాని: నేను మాత్రం ముసలివాణ్ని కాదేమిటి? నువ్వంటేనే నాకు విసుగు పుడుతోంది. నటీమణులు వినోదం కలిగించాలి. కాని, నీ సంగతి చెప్పు.

తాత్యానా: మామూ. మీకు తెలుసును కదా!........

సేనాని: మా కేమీ తెలియదమ్మా!.

పౌలీనా: ఫాక్టరీని మూసివేస్తున్నాం....

సేనాని: ఏమిటీ? చెప్పావుకాదు! బలేబాగుంది. చెవులు గింగురు మంటూ ఇంకా నిద్రపోతుండగానే, ఊఁ! ఊఁ! అంటూ ఒకటే ఈల, గోల! యికమీదట యీ పీడపుండవన్న మాటే! సెభాష్! భేషైన పని చేశారు.

మైఖేల్: (వేగంగా వస్తూ) నికోలాయ్, ఒకమాట! (చాటుగా) ఫాక్టరీ మూయించి వేశాను. ఎందుకైనా మంచిది, తగు రక్షణ చర్యలు తీసుకోవాలి. వైస్ గవర్నరుకి ఒక టెలిగ్రాం పంపు. ఇక్కడ పరిస్థితులు తెలియ పరచి, సైనికులను పంపమని కోరు. నా సంతకం పెట్టు.

నికోలాయ్: ఆయన నాకూ స్నేహితుడే.

మైఖేల్: ఆ ప్రతినిధుల పీడ వదల్చి వస్తాను. టెలిగ్రాం విష యం యెవరికీ చెప్పకు. అవసరమని తోస్తే, నేనే

చెబుతాస్లే. సరేనా?

నికోలాయ్: సరే!

మైఖేల్: మన యిష్ట ప్రకారం, తోచిన విధంగా పని జరుపుకు పోతూంటే బహు కులాసాగా వుంటుంది. నీ కంటె వయస్సులో పెద్దవాడినైనా స్వభావంలో మాత్రం యువకుణ్ణే! ఔనంటావా? కాదంటావా?

నికోలాయ్: అది యౌవనం కాదు, నా వుద్దేశ్యంలో నరాల బల హీనత!

మైఖేల్: నరాల బలహీనతో, యేమిటో నువ్వే చూస్తావుగా? (నవ్వుతూ వెళ్ళిపోతాడు.)

పౌలీనా: ఆ విధంగా చేసేందుకే నిశ్చయించారా నికోలాయ్?

నికోలాయ్: (వెడుతూ) ఆఁ.

పౌలీనా: ఓయి భగవంతుడా!

సేనాని: ఏం చేసేందుకు నిర్ణయించా రంటున్నావు?

పౌలీనా: ఫాక్టరీ మూసివేసేందుకు!

సేనాని: ఓహో, అదా! ...కాన్!

కాన్: ఇక్క డున్నా నండయ్యా!

సేనాని: చేపల వల, గాలం, పడవ సిద్ధం చెయ్యి.

కాన్: అన్నీ తయారుగా వున్నాయి దేవరా!

సేనాని: చేపలతో కాలక్షేపం చెయ్యడానికి వెడుతున్నాను. మనుష్యుల చేత చివాట్లు పడుతూ ఇక్కడ కూర్చునే కంటే అదే తెలివైన పని! (నవ్వుతూ) మహా మజా గా మాట్లాడాను కదూ? (నాద్యా లోపలికి పరుగెత్తు

కొస్తుంది.) ఓహో, వన్నెల విసనకర్రా! ఏమిటీ విశేషం?

నాద్యా (ఆనందంతో) బలే సాహసకృత్యం జరిగిందిలే! (వెనుకకు తిరిగి పిలుస్తుంది.) దయ చేసి లోపలికి రా, గ్రికోవ్! క్లియోపాత్రా పెట్రోనా! అతణ్ణి వెళ్ళి పోనివ్వవద్దు. మేము అడవిలోనుంచి వస్తోంటే- పిన్నమ్మా! - అకస్మాత్తుగా తప్ప తాగిన కూలీలు ముగ్గురు మాకు అడ్డం వచ్చారు........

పౌలీనా: చూచావా?........ మొదటినుంచీ చెబుతూనేవున్నా....

క్లియోపాత్రా: (గ్రికోవ్ వెంబడిరాగా) ఇంతకంటే అసహ్యమైన దుర్ఘటనను ఊహించడంకూడా కష్టమే!

నాద్యా: అసహ్యమంటా వేమిటి? ఎంతో తమాషాగా వుంది. ముగ్గురు కూలీలు, పిన్నమ్మా! అందరూ నవ్వుతో "ప్రియమైన దొరసానుల్లారా!" అన్నారు.

క్లియోపాత్రా: మా ఆయనతో చెప్పి, వాళ్ళని తక్షణం తీయించి పారవేస్తాను.

గ్రికోవ్: (నవ్వుతో) ఎందుచేత?

సేనాని: (నాద్యాతో) వీడెవ్వడు? లాంతర్లు తుడిచేవాడా?

నాద్యా: అతనే తాతా! మమ్మల్ని రక్షించాడు. అర్థమైందా?

సేనాని: నాకేమీ బోధపడలేదు.

క్లియోపాత్రా: నీ మాటల ధోరణి యెవరికి అర్థమౌతుంది?

నాద్యా: జరిగింది జరిగినట్లుగా చెబుతున్నానమ్మా!

పౌలీనా: సరే, నువ్వు చెప్పింది నాకేమీ బోధపడలేదు నాద్యా!

నాద్యా: చెప్పడం మొదలుపెట్టింది మొదలు ఒకటే అంత రాయాలాయె........ వాళ్లు మాదగ్గరకొచ్చి "దొర సానులూ! మాతోకలిసి పాటపాడరాదూ?" అన్నారు.

పౌలీనా: ఓయి భగవంతుడా! ఎంత మితిమీరిపోయారు!

నాద్యా: అదికాదు పిన్నమ్మా! "మీరు చాలా బాగా పాడుతా రని విన్నాం. మేము తాగినమాట వాస్తవమే నను కోండి! ఎక్కలు మొక్కలు చేసుకునే మాబోటివాళ్లం తాగినప్పుడే మనుష్యులం" అన్నారు. ఆ మాట యదార్థం పిన్నీ! తాగనప్పుడు పనివాళ్లు విచారగ్రస్తుల వలె యీదురో గోదురోమంటూ వుంటారు.

క్లియోపాత్రా: అదృష్టవశాత్తూ యీ క్రూరవాడు......

నాద్యా: నీ కంటే నేనే బాగా చెబుతాను. క్లియోపాత్రా పెట్రోనా వారిని తిట్టడం మొదలెట్టింది! ........ వారిని తిట్ట నవసరం లేదమ్మా! తిట్ట నక్కరలేదు ఇంతలోనే వారిలో ఒకడు పొడుగ్గా, బక్కపలుచనగా వున్నాడు.

క్లియోపాత్రా: (బెదరింపుగా) వా డెవడో నాకు తెలుసునులే!

నాద్యా: ఈవిడ చెయ్యి పట్టుకొని, మీ రింత అందగత్తెలు, నాగరీకులు, "మీ వంక చూడటానికే ముచ్చటగా వుంటుంది. ఐనప్పటికి మీరు తిడుతున్నారు. మీ మన స్సుకు నొప్పి కలిగించామా మేము?" అంటూ దీనం గా, జాలిగా అన్నాడు. ఆ మాటలు ఎంత చక్కగా అన్నాడనుకున్నావు? వాడి హృదయాంతరాళం నుంచి

వచ్చాయి. ఈలోగా ఇంకొకడు - వాడు నిజంగా పరుషంగానే మాట్లాడేడు. "వీరితో మాట్లాడటం వలన యేమి ప్రయోజనం కలుగుతుంది? మనుష్యుల మీద సవారీ చేయడం అలవాటుపడ్డవారికి, మంచి చెడ్డలేం తెలుస్తాయి? వారు మనుష్యులు కాదు, మృగాలు" అంటే మేమేనన్న మాట! నేనూ, యీవిడాను. (అంటూ నవ్వుతుంది.)

తాత్యానా: (నవ్వుతూ) ఆ బిరుదు నీకు చాలా సంతోషం కలిగించినట్లుందే!

పొలీనా: నీకు చెప్పానా లేదా, నాద్యా? ఇట్లా అయిన చోటికీ కాని చోటికీ తగ్గుదు నమ్మా అంటూ, షికార్లు కొడుతూంటే........

గ్రికోవ్: (నాద్యాతో) ఇక నేను వెళ్ళి వస్తాను.

నాద్యా: వద్దు, వద్దు, అప్పుడే వెళ్ళవద్దు! కొద్దిగా టీ పుచ్చుకోవా?.... లేకపోతే, పాలు? కొద్దిగా పుచ్చుకో. (సేనాని నవ్వుతాడు, క్లియోపాత్రా భుజా లెగరవేస్తుంది. గ్రికోవును పరిశీలనగా చూస్తూ, తాత్యానా నెమ్మదిగా యేదో పాట పాడుకుంటూ వుంటుంది. పొలీనా తల వంచుకొని, చెంచాలను తువ్వాలుతో తుడుస్తూంటుంది.)

గ్రికోవ్: (నవ్వుతూ) వద్దు. అనేక అభివందనాలు. నా కేమీ అవసరం లేదు.

నాద్యా: మొహమోట పడకు....వీ రందరూ చాలా మంచివారు.

పౌలీనా: (సిరునగా) ఓసి నాద్యా!

నాద్యా: (గ్రికోవ్‌తో) అప్పుడే వెళ్ళిపోకు. సొంతం చెప్పలేదు

క్లియోపాత్రా: (స్వల్ప కోపంతో) ఒక ముక్కలో చెప్పాలంటే సరిగా అదే సమయానికి యీ కుర్రవాడు వచ్చి తన తాగుబోతు స్నేహితులకు సచ్చచెప్పి పంపేశాడు. ఇంటివరకూ మమ్మల్ని సాగనంపి రమ్మని అడిగాను. మాతో కూడా వచ్చాడు. ఇదీ జరిగిన సంగతి.

నాద్యా: అబ్బబ్బ! ఎట్లా చెప్పావమ్మా! నువ్వు చెప్పినట్లే జరిగి వుంటే,...... విసుగుతో ప్రాణాలు పోయి వుండును.

సేనాని: సరే, ఇప్పుడు మమ్మల్ని యేమి చేయమంటావు?

నాద్యా: (గ్రికోవ్‌తో) కూర్చో; కూర్చోమని చెప్పవేం పిన్నమ్మా? మీ రందరూ యింత చిరాకుగా వున్నా రెందుకర్రా?

పౌలీనా: (కూర్చున్న చోటునుండే, గ్రికోవ్‌తో) నీకు చాలా కృతజ్ఞురాలను, అబ్బాయ్!

గ్రికోవ్: దయ యుంచి ఆ విషయం యెత్తకండి!

పౌలీనా: ఆ దుండగీళ్ళ బారినుంచి వీరిని రక్షించి, చాలా ఉపకారం చేశావు.

గ్రికోవ్: (శాంతంగా) వీరిని కాపాడవలసిన అవసరం లేనే లేదు. వీరి కెవ్వరూ యెట్టి హానీ కలిగించలేదు.

నాద్యా: ఐతే పిన్నమ్మా! ఇంత కష్టం కలిగించే మాట లెట్లా అన్నావమ్మా?

పౌలీనా: నాకు నీతులు చెప్పడం మానుకొమ్మని, యెన్ని పర్యాయాలు చెప్పాలి?

నాద్యా: అసలు సంగతి ఆలోచించి చూస్తే, ఎవరూ, ఎవర్నీ రక్షించలేదు. "వారి గొడవ మీ కెందుకూ కావ్రమే డ్సు? వారి త్రోవను వారిని పోనీయండి. మీరు చేసే పని ఆట్టే మంచిది కాదు'' అన్నాడు అంతే. ఇతణ్ణి చూచేటప్పటికి వారికి చాలా ఆనందం కలిగింది. ''గ్రికోవ్ మాతో రావయ్యా! నువ్వు చాలా తెలివైన కుర్రాడివి." అన్నారు. నిజంగా, పిన్నమ్మా! యీ గ్రికోవ్ చాలా తెలివైనవాడే....క్షమించు !గ్రికోవ్ యీ మాట యదార్థం!

గ్రికోవ్: (నవ్వుతూ) మీరు నన్ను చాలా లజ్జాకరమైన పరిస్థితుల్లో పెడుతున్నారు.

నాద్యా: నిజంగా? తెలిసి నీ మనస్సుకు కష్టం కలిగించను. నే నట్టిదానను కాను, గ్రికోవ్!

పౌలీనా: యేమిటమ్మా, యీ వేలం వెర్రి! చూడగా, చూడగా వెర్రి తలలు వేస్తున్నాయి. అందరికీ నవ్వులాటగా వుంది, చాలించు.

నాద్యా: (ఉద్రేకంతో) ఐతే, ఇంకా చూస్తారేం? నవ్వండి! గుడ్లగూబల్లాగు ముడిగ్రుడ్లు వేసుకొని చూస్తూ కూర్చున్నారేం? నవ్వండి.

క్లియోపాత్రా: ఈ నాద్యాకు గోరంతలు కొండంతల్లు చేసే శక్తి విపరీతంగా వుంది. పాల పొంగులా, ఉత్సాహంతో

పొంగిపోతుంది. కొత్తవాళ్ళ యెదుట యెంత రభస చేస్తోందో! అతడు నవ్వుతున్నాడు కూడాను.

నాద్యా: (గ్రికోవ్‌తో) నన్ను చూచి నవ్వుతున్నావా? ఏం, ఎందుచేత?

గ్రికోవ్: (సహజ స్వరంతో) మిమ్మల్ని మెచ్చుకుంటున్నాను. కాని, నవ్వడం లేదండీ.

పౌలీనా: (తడబాటుతో) ఏమిటీ?....మీ బాబాయ్....

క్లియోపాత్రా: (చిరు నవ్వుతో) అదీ విషయం!

సేనాని: సరే, చాలు! ఒరే అబ్బాయీ, ఇది తీసికొని వెళ్లు.

గ్రికోవ్: (తిరిగి వెళ్ళబోతూ) అభివందనాలు........అది అనవసరం లెండి!

నాద్యా: (ముఖం రెండు చేతుల్తో కప్పుకుంటూ) అబ్బబ్బ! ఎంత అవమానం చేస్తున్నావయ్యా!

సేనాని: (గ్రికోవ్ నాపుతూ) ఒక నిమిషం ఆగు! ఇవిగో పది రూబుళ్లు.

గ్రికోవ్: (గంభీరంగా) ఐతే ఏమంటారు?

సేనాని: (తొట్రుపాటుతో) ఆరి....ఎవడివయ్యా నువ్వు?

గ్రికోవ్: పనివాళ్ళలో ఒకణ్ణి

సేనాని: కమ్మరివా?

గ్రికోవ్: కాదు, ఫిట్టరుని.

సేనాని: (తీవ్రంగా) అన్నీ ఒకటేలే. యీ సొమ్ము యెందుకు తీసికోవూ?

గ్రికోవ్: నాకు అక్కర లేదు కనుక.

సేనాని: శుద్ధ తెలివి తక్కువ అంటాను. ఐతే ఏమి కావా లంటావు?

గ్రికోవ్: ఏమీ అక్కరలేదు.

సేనాని: బహుశా యీ పిల్ల నిచ్చి పెళ్ళి చెయ్యమని కోరే టట్లున్నావే? (అని నవ్వుతాడు. ఈ పరిహాసానికి మిగిలిన అందరూ చిరాకు పడతారు.)

నాద్యా: ఛీ! ఛీ! ఛీ! ఏమి మాట లివ్వి?

పౌలీనా: మామా! దయ చేసి........

గ్రికోవ్: (గంభీరంగా సేనానితో) మీ వయస్సెంత?

సేనాని: (ఆశ్చర్యంతో) ఏమిటీ? నాకా? వయ స్సెంతా!

గ్రికోవ్: (దృఢ స్వరంతో) ఔను. మీ కెన్నేళ్లున్నాయ్?

సేనాని: (తెల్లబోయి చూస్తూ) ఓహో! ఇదేం వ్యవహారం! అరవై ఒకటి. వయస్సుతో పనేముంది?

గ్రికోవ్: (వెడుతూ) మీ వయస్సులో యింకా యెక్కువ జ్ఞానం వుండాలి.

సేనాని: ఏమిటీ?....నా కింకా యెక్కువ జ్ఞానం వుండాలా? నా?

నాద్యా: (గ్రికోవ్ వెనుక పరుగెత్తుతూ) దయ యుంచి........ కోపం తెచ్చుకోకు, ఆయన ముసలివాడులే! నిజం చెబుతున్నాను, నా మాట నమ్మ. వీ రందరూ స్వత హాగా మంచివాళ్ళే.

సేనాని: యీ గొడవ యేమిటోయ్?

గ్రికోవ్: మీ రేమీ బాధ పడకండి!........ ఇ దంతా బహు సహజంగానే వుంది.

నాద్యా: ఈ వేళ యెండ బహు తీవ్రంగా వుంది కదూ! .... అందరూ మహా చిరాకుగా వున్నారు.... పైగా నేను జరిగిన విషయం సరిగా చెప్పలేకపోయాను.

గ్రికోవ్: (చిరు నవ్వుతో) మీ రేవిధంగా చెప్పినా సరే, వా రెన్నడూ మిమ్మల్ని సరిగా అర్థం చేసుకోలేరు.
(వా రిద్దరూ నిష్క్రమిస్తారు.)

సేనాని: (కోపంతో) ఎంత సాహసం! ఎంత దురుసుగా మా ట్లాడాడు, నాతో!

తాత్యానా: నువ్వు డబ్బిస్తానని అనకూడదు.

పాలీనా: అబ్బబ్బ! యీ నాద్యా ఏం పిల్లమ్మా!

క్లియోపాత్రా: వాడి కెంత పొగరో! తలబిరుసు మనిషి! మా ఆయనతో చెప్పి వీడిని పనిలోనుంచి పీకించివేస్తా!

పాలీనా: ఐనా, యీ నాద్యా అసాధ్యపు పిల్లమ్మా! వాడితో కలిసి వెళ్ళింది చూడండి! నా తల కొట్టివేసే నట్లుంది.

క్లియోపాత్రా: మీ సోషలిష్టులు రోజు రోజుకీ శృతి మించి రాగాన పడుతున్నారు. పెద్దా పిన్నా, మంచీ చెడ్డా....

పాలీనా: వా డొక సోషలిష్టని యెందు కనిపించిందమ్మా నీకు?

క్లియోపాత్రా: కనిపిస్తూనే వుందిగా! పరిశుభ్రంగా వుండే పనివా ళ్ళందరూ సోషలిస్టులే.

సేనాని: ఈ సమాచారం జఖార్‌తో చెప్పి, ఈ రోజునే ఆ

పొగరుబోతు పనివాళ్ళని చెవులు పట్టుకొని ఫ్యాక్టరీ అవతలకి యీడ్చించి పారవేస్తాను.

తాత్యానా: ఫ్యాక్టరీ మూసి వేశారయ్యా!

సేనాని: మూసివేస్తే నేమిలే!....చెమ్డాలు ఎక్కతీస్తాను.

పౌలీనా: టాన్యా! వెళ్ళి, నాద్యాను పిలుచుకొని రా. వెళ్ళి రా వమ్మా, నాకు చాలా కోపం వచ్చిందని చెప్పి, తీసికొనిరా.

(టాన్యా వెడుతుంది.)

సేనాని: పుండాఖోర్! వయస్సెంతని అడుగుతాడా?

క్లియోపాత్రా: ఆ కూలీలు మా వెనుక యీలలు వేసి చప్పట్లు చరుస్తున్నారు....మరి మీరో, వారికి అధ్యయనపు తరగతులనీ, వార్తా పత్రికా పఠనమనీ చెప్పి, నెత్తిపై నెక్కించుకుంటున్నారు. బలే తమాషాగా వుంది మీ తంతు.

పౌలీనా: ఔ నౌను, నువ్వు చెప్పేది యదార్థమే. క్రిందటి గురువారం నేను ఊళ్ళోకి పని వుండి వెళ్ళాను. నా వెనుక యెవరో అకస్మాత్తుగా ఈలలు వేయనారంభించారు. మా గుర్రాలు బెదరిపోయాయి కూడాను. చూడండి, ఎంత అసహ్యంగా మితి మీరి ప్రవర్తిస్తున్నారో ఈ పనివాళ్ళు.

క్లియోపాత్రా: ఈ విషయంలో లోపమంతా జఖార్ ఇవానోవిచ్‌దే కూలీలను యెంత దూరంలో వుంచాలో, అంత దూరంలో ఆయన వుంచరు. మా ఆయన అస

మానమూ ఆ మాటే అంటూ వుంటారు.

పౌలీనా: ఆయనది చాలా మెత్తని మనస్సు. ప్రతివారిపైన దయ చూపుతారు. దయతో ప్రవర్తించడం అందరికీ లాభదాయకమైన పద్ధతి అని, ఆయన ఉద్దేశ్యం. రైతులకు సంబంధించినంతవరకూ యీ దృక్పథం వలన నష్టం లేదు. భూములు కౌలుకు పుచ్చుకుంటారు. మన పాలు అంబారం మన కిచ్చేస్తారు, అంతా సవ్యంగా జరిగిపోతుంది. కాని వీళ్ళో, (తాత్యానా, నాద్యాలు వస్తారు.) నాద్యా...., పిచ్చి తల్లీ....ఎంత అసభ్యంగా ప్రవర్తించావమ్మా! నీ ప్రవర్తన........

నాద్యా: (కోపంతో) మీరే, మీరు అసభ్యంగా ప్రవర్తించారు! మీరు!! వే డెక్కువై మీ బుర్రలు చెడిపోయాయి. మీరే నీచంగా ప్రవర్తిస్తున్నారు. మీ గొడవ తప్ప, మీ గొప్పలు మినహా, మీ కేమీ అర్థం గాదు. ఇంక యీ తాత సంగతి! అబ్బబ్బ! యెంత బుద్ధి హీనత!

సేనాని: (ఆగ్రహంతో) నాకా? బుద్ధి హీనతా? మళ్ళీ అను ఆ మాట!

నాద్యా: నన్ను పెళ్ళాడాలని ఉందా, అని ఎందు కన్నావ్? నీకు సిగ్గూ యెగ్గూ లేవూ?

సేనాని: సిగ్గా? హద్దు మీరిపోయారయ్యా, మీ రంపరూను! ఈ నాటి కింక చాలు! (గట్టిగా అరుస్తూ వెళ్ళి

పోతాడు.) కాన్! ఎక్కడ చచ్చావురా? మాయమై పోయావ్! బుర్ర తక్కువ పీనుగా!

నాద్యా: నువ్వో, పిన్నమ్మా నువ్వు, విదేశాల్లో కూడా సంచారం చేశావు. రాజకీయాలను గూర్చి వేదికలపై ఉపన్యాసాలు దంచేస్తావే!.... అతనిని ఆహ్వానించి, ఒక కప్పు టీ యిస్తే నీ ఘనత కేమి లోటు వస్తుంది?

పాలీనా: (విసురుగా లేచి, ఒక చెంచా కిందకు విసరివేస్తూ) నువ్వు మహా అసాధ్యురాల వైపోతున్నావు! నువ్వే మంటున్నావో తెలిసే మాట్లాడుతున్నావా?

నాద్యా: నువ్వానమ్మా, క్లియోపాత్రా పెట్రోనా!.... ఇంటికి వచ్చేటప్పుడు దారిలో మహా తీపిగా చెప్పావు కబుర్లు. కాని మనం యిక్కడకు చేరుకోగానే........

క్లియోపాత్రా: ఏమి చేయాలేమిటి నేను? ముద్దెట్టుకోవాలా వాణ్ణి? క్షమించు, కంపు కొడుతూ అసహ్యంగా వుంది వాడి ముఖం. ఐనా, నువ్వు నీతులు గరప నక్కర లేదు మాకు. చూచావా, పాలీనా! మీ ప్రజా స్వామ్య వాదం యెంతవరకు వచ్చిందో! విషమించి మిమ్మల్నే బెడిసి కొడుతోంది. ప్రజాతంత్రం అంటారా, మానవవాదమా? దీని వలన కలిగిన చెడుగును తొలగించేందుకు మా ఆయనా సతమతమైపోతున్నారు. మీరూ నష్టపడుతున్నారు. ఒక్క మా ఆయనకే యీ బాధంతా అనుకోకండి. చూస్తూ వుండండి!

పౌలీనా: నాద్యా ప్రవర్తనకు, నీకు నేను క్షమార్పణ చెప్పుకుం టున్నాను. క్లియోపాత్రా....

క్లియోపాత్రా: (వెడుకో) శుద్ధ అనవసరం. ఒక్క నాద్యాయే కాదు, మీ రందరూ సమానంగా నేరస్థులే.

పౌలీనా: విను నాద్యా! మీ అమ్మ చనిపోయేటప్పుడు నిన్ను పెంచి పెద్దదాన్ని చెయ్యమని నా చేతుల్లో పెట్టి పోయింది.

నాద్యా: మా అమ్మ పేరు తలపెట్టకు? ఆవిడనుగూర్చి మీ రెప్పుడూ సరియైన సంగతులు చెప్పరు;

పౌలీనా: (ఆశ్చర్యంతో) నాద్యా! నీ వంట్లో బాగుండలేదా? ఏమంటున్నావో ఆలోచించు! మీ అమ్మా, నేనూ ఒక కడుపున పుట్టాం. మీ అమ్మను నీ కంటె నేనే బాగా యెరుగుదును!

నాద్యా: (కండ్ల నీరు ఆపుకొనలేక) మా అమ్మను గూర్చి నీ కేమీ తెలియదు. భాగ్యవంతులకూ, బీదలకూ యేమీ సామ్యం వుండదు........ మా అమ్మ బీదది. ఆమె చాలా మంచిది....మీరు పేదవారి నేమీ అర్థం చేసుకోలేరు. టాన్యా పిన్నినైనా మీరు అర్థంచేసుకో లేరు.

పౌలీనా: నాద్యా! నా యెదుటనుంచి వెళ్ళిపో! తక్షణం వెళ్ళిపో.

నాద్యా: (వెడుతో) వెడుతున్నాను.... నేను చెప్పింది మాత్రం నిజం....

పౌలీనా: అరి భగవంతుడా! శుభ్రంగా ఆరోగ్యంగా వున్న యీ

పిల్లకు యెంత అకస్మాత్తుగా అపస్మారకం వచ్చింది! పేలాపన! క్షమించు టాన్యా! నీ మాటలు విని చెడి పోతుంది యీ పిల్ల. ఈ అమ్మాయితో వయసు కత్తెతో మాట్లాడేటట్లు అన్ని సంగతులూ చెబుతూం టావు. మన పనివాళ్ళ దగ్గరకూ, మన ఆఫీసులో వున్న వింత మనుష్యుల దగ్గరకుకూడా తీసికొని వెడు తున్నావు. అది శుద్ధ అసందర్భపు పని. అదీకాకుండా పడవల్లో షికార్లు కూడాను!

తాత్యానా: శాంతించు. ఏదైనా పానీయం సేవించండి! ఆ కార్మి కునితో తెలివి తక్కువగా ప్రవర్తించా రనడం నిర్వి వాదాంశం. ఆ కుర్చీ మీద కూర్చోమంటే, అది ఏమైనా అరిగిపోతుందా, మైలపడిపోతుందా?

పౌలీనా: మీరు పొరబడుతున్నారు. కార్మికుల పట్ల నే నవలం బించిన వైఖరి తప్పని యెవ్వరూ నాపై నింద మోప లేరు. కాని ప్రతిదానికి ఒక హద్దూ పద్దూ వుండాలి.

తాత్యానా: ఈ అమ్మాయిని వెంట పెట్టుకొని నే నెవ్వరి దగ్గ రకూ తీసుకెళ్ళడం లేదు. మీరు అంటున్నట్లుగానే ఆమె స్వయంగానే వెడుతోంది....ఆమెను వెళ్ళకుండా వారించడం అవసరమని నేను భావించడం లేదు.

పౌలీనా: స్వయంగానే వెడుతోందట! ముక్కుపచ్చలారని దానికి ఏం తెలుసు? యెక్కడికి వెడుతోందో:

(యాకోవ్ నెమ్మదిగా వస్తాడు. కొద్దిగా తాగి వుంటాడు.)

యాకోవ్: (కూర్చుంటూ) ఫాక్టరీలో గలభా జరిగేలా వుంది.
పౌలీనా: (బాధతో) ఆ సంగతి ఎత్తకు యాకోవ్ ఇవానోవిచ్!
యాకోవ్: అవును. గొడవ జరుగుతుంది. ఈ ఫాక్టరీకి నిప్పు పెట్టి, మ నందర్నీ శలభాల్లాగు మాడ్చివేస్తారు.
తాత్యానా: (విసుగుతో) అప్పుడే తాగుడు మొదలు పెట్టావూ?
యాకోవ్: ఇందులో కొత్త యేముంది? నే నెప్పుడూ యీ పాటికి తాగుతూనేవున్నానుగా! ఇంతకు క్రితమే క్లియో పాత్రాను చూచాను. అది ఒట్టి నీచురాలు. దానికి హృదయం ఉండవలసిన స్థానంలో ఒక ముసలి కుక్క వుంది.
పౌలీనా: (లేస్తూ) ఓయి దేవుడా!....అంతా సవ్యంగా జరిగిపో తూంటే మధ్య చిచ్చర పిడుగులాగు యీ అవాంతరం వచ్చి పడిందేమిటి? (తోటలో యిటు అటూ తిరుగు తూంటుంది.)
యాకోవ్: మామూలు కుక్క కూడా కాదు, గజ్జి పట్టిన పుచ్చు కుక్క. మరీ పెద్దది కాదు కాని, బహు పీనాసిది. దొరికిన దంతా తినేసి, యింకా కావాలంటూ నోరు తెరిచి, పళ్ళికిలిస్తూ కూర్చుంటుంది. ఐతే, ఆ కావ లసిం దేమిటో మాత్రం దానికి అవగాహన కావడం లేదు.
తాత్యానా: నిశ్శబ్దంగా వుండు యాకోవ్! మీ అన్నగారు వస్తు న్నారు.
యాకోవ్: మా అన్న వస్తే నాకేమి భయం? టాన్యా! ఇక

మీదట నువ్వు నన్ను ప్రేమించలేకుండా వున్నావనే విషయం గుర్తించి, చాలా బాధ పడుతున్నాను. ఎంత బాధ కలుగుతున్నా, నిన్ను ప్రేమించకుండా వుండ లేకపోతున్నాను.

తాత్యానా: ఈ మత్తు వదిలితే బాగుండును. పోయి నదిలో యీది రాకూడదూ?

జఖార్: (వస్తూ) ఫాక్టరీ మూసి వేశామని అప్పుడే ప్రకటించారా?

తాత్యానా: నాకు తెలియదు.

యాకోవ్: ఇంకా చెప్పలేదు కాని, కూలీ లందరికీ అప్పుడే యీ విషయం తెలిసింది.

జఖార్: ఎట్లా తెలిసింది? ఎవరు చెప్పారు?

యాకోవ్: నేనే చెప్పాను.

పౌలీనా: ఎందుకు చెప్పావు?

యాకోవ్: (భుజా లెగురవేసి) తమాషాకోసం! ఈ విషయం వాళ్ళకి బలే సరదా కలిగించింది. వినే వాళ్లుంటే, నే నన్ని విషయాలూ చెబుతాను. వాళ్ళ యజమాని తమ్ముడు గొప్ప త్రాగుబో తంటే, కూలీల కెంతో సంతోషం. మానవు లందరూ సమానులే, గొప్ప తేడా లేవనే భావం వారి మనోఫలకంపై గట్టిగా ముద్ర పడేందు కీ విషయ మెంతో ఉపకరిస్తుంది.

జఖార్: హఁ....హఁ. ... నువ్వు ఫాక్టరీలోకి బహు తరుచుగా వెడుతున్నావు యాకోవ్! దానివల్ల పోయిందేమి

లేదుగాని, నువ్వు కూలీల యెదుట యజమానులను తృణీకరించి మాట్లాడుతున్నావని మైఖేల్ వా లీవిచ్ చెబుతున్నాడు.

యాకోవ్: ఆమాట శుద్ధ అబద్ధం. నా కీ యాజమాన్యాన్ని గురించి కాని, వారి తప్పుడు నడకలను గూర్చి గాని యేమీ తెలియదు.

జఖార్: కొన్ని సమయాల్లో ఫాక్టరీలోనికి ఓడ్కా బుడ్లను నీతో తీసుకొని వెడుతున్నావని కూడా ఆయన ఫిర్యాదు చేస్తున్నాడు.

యాకోవ్: ఆ మాట అబద్ధం. నాతో తీసుకొని వెళ్ళను. తెప్పిచుకుంటాను. ఒక పర్యాయమే కాదు, నేను వెళ్ళిన ప్రతి దఫా తెప్పించి తాగుతాను. నేను తాగుతాననే, నే నంటే పనివాళ్ళకు సరదా.

జఖార్: కాని యాకోవ్! ఒక్క విషయం గట్టిగా ఆలోచించి చూడు! నువ్వు ఫాక్టరీ యజమాని సోదరుడివి కదా!

యాకోవ్: అ దొక్కటే నా లోపం కాదు.

జఖార్: (కోపంతో) సరేలే! నీతో నే నేమీ చెప్పనులే. శత్రు వాతావరణం నా చుట్టూ అలముకుని వున్నట్లు స్పష్టంగా గోచరిస్తోంది. దీనికి కారణం మాత్రం అర్థం కావడం లేదు.

పౌలీనా: ఆ మాట మాత్రం యదార్థం. ఇంత క్రితం నాద్యా ధోరణి విన్నారు కాదు మీరు.

పొలోగీ: (లోపలికి పరుగెత్తుకొని వచ్చి) అయ్యా, అయ్యా!

ఇప్పుడే, ఇప్పుడు మన డైరెక్టరుగార్ని చంపేశారు.

జఖార్: ఏమిటీ!

పౌలీనా: ఏమిటీ!....ఏ మన్నా విప్పుడూ?

పొలోగీ: ఆయన్ని చంపేశారు....నిఝవునా ప్రాణం తీశారు.... కూలిపోయాడు.

జఖార్: ఎవరు? ఎవరు చంపారు?

పొలోగీ: కూలీలు .......

పౌలీనా: చంపిన వాళ్ళని పట్టుకొన్నారా?

జఖార్: వైద్యు డొచ్చాడా?

పొలోగీ: నాకు తెలియదండీ. ..

పౌలీనా: యాకోవ్ ఇవానోవిచ్! పోయి చూసిరా!

యాకోవ్: (నిస్సహాయ సూచకంగా) ఎక్కడికి?

పౌలీనా: ఏం జరిగిం దసలు?

పొలోగీ: మన డైరెక్టరు కంగారు పడ్డారు....ఒక కూలివాడి డొక్కపై కాలు పెట్టాడు....

యాకోవ్: వా ళ్ళొస్తున్నా రిక్కడకు.

(గందరగోళం! లెవ్‌షిన్ అను మధ్యప్రాయపు బట్టతల కార్మికుడు ఒక ప్రక్కను, నికోలాయ్ మ రొక ప్రక్కను పట్టుకొని మైఖేల్ స్క్రొబాటోవును యెత్తుకొని తీసుకు వస్తారు. పనివారు చాలమంది వారి వెనుక వస్తారు.)

మైఖేల్: (అలసట చెందిన స్వరంతో) అబ్బ!........వదలండి నన్ను కిందకు దింపండి!

నికోలాయ్: నిన్ను కాల్చిందెవరో చూశావా !

మైఖేల్: నాకుచాలా ఆయాసంగా వుంది... పూర్తిగా అలసి పోయాను.

నికోలాయ్: నీపై తుపాకి కాల్చినవాణ్ణి గుర్తుపట్టగలవా ?

మైఖేల్: నన్ను బాధ పెడుతున్నారన్రా, మీరు!....ఒక ఎర్ర తలవాడు....

(పచ్చిక దిబ్బమీద పడుకో బెడతారు)

నికోలాయ్: (ఒక పోలీసు సార్జెంటుకో) విన్నావా ఆమాట! ఎవడో ఎర్రజుట్టుతలవాడట!

పోలీసు: చిత్తం, దేవరా !

మైఖేల్: ఆహా ! ఐతే యిప్పుడంతా ఒకమోస్తరుగా నేవుంది.

లెవ్‌షిన్ (నికోలాయ్‌తో): ప్రస్తుతం ఆయనను పలకరించి, బాధపెట్టకుండా వుండటం మంచిదికాదా.

నికోలాయ్: మాట్లాడకు, నిశ్శబ్దం ! డాక్టరెక్కడ ? డాక్టరెక్కడున్నాడూ అని అడుగుతున్నాను నిన్ను !
(అందరూ ఒకరితోఒకరు గుసగుసలాడుతో, ప్రయోజన శూన్యంగా యిటుఅటు తిరుగుతూంటారు).

మైఖేల్: గోల చెయ్యకండి....అబ్బ....అమ్మ....బాధ.... పడుకోనివ్వండి.

లెవ్‌షిన్: మైఖేల్ వాసిలీవిచ్ ! విశ్రాంతిగా పడుకోండి! ఈ మానవుల వ్యాపారమంతా పైసా వ్యవహారం ! ఈ పైసాయే అన్ని అనర్థాలకు మూలం. పైసాయే మానవుని సర్వానాశనం చేస్తుంది. పైసాకోసం పుడ

తాడు, పైసాతోనే గిడతాడు !

నికోలాయ్: సార్జెంట్ ! పరాయివాళ్లందర్నీ, బైటకు పంపించి వెయ్యి!

పోలీసు: (గొంతుక తగ్గించి) ఏంచూస్తారు వింత! పొండి, బయటకు పొండి !

జఖార్: (నెమ్మదిగా) డాక్టరెక్కడున్నాడు ?

నికోలాయ్: మిషా ! మిషా ! (తనసోదరుని శరీరమును తాకి చూస్తాడు.

(మిగిలినవారూ అదేపని చేస్తారు) లాభంలేదు. సర్వం ముగిసి పోయిం దనుకుంటాను.

జఖార్. అసంభవం ! నీరసంలో మూర్ఛపోయాడేమో.

నికోలాయ్: (నెమ్మదిగాను, శాంతంగాను) లేదు. ఆయన చని పోయాడు. దీని పర్యవసాన మేమిటో గుర్తించారా జఖార్ ఇవానోవిచ్ !

జఖార్; ఐతే....మీరు పొరపడలేదుగదా !....

నికోలాయ్: లేదు, నేను పొరపడలేదు. ఈయన మరణానికి కారకులు మీరే !

జఖార్: (మ్రాన్పడి) నేనా !

తాత్యానా: ఎంతక్రూరం........ఎంతబుద్ధిహీనత !

నికోలాయ్: (జఖార్‌తో తీవ్రంగా) : ఔను, మీరే !

పోలీసుచీఫ్ (లోనికి పరుగెత్తుకొనివచ్చి) డైరెక్టరెక్కడున్నారు ? ప్రమాదకరమైన గాయాలు తగిలాయా ?

లెవ్‌షిన్: ఆయన మరణించారు. ప్రతివారిని తొందరపెట్టేశే

వారు. ఉరుకులూ పరుగులూను. ఇప్పుడు చూడండి, ఆయనపరిస్థితి.

నికోలాయ్: (పోలీసుచీఫ్‌తో) తన్ను కాల్చినవాడు ఒక ఎఱ్ఱతల వాడని చెప్పేందుకు మాత్రమే ఆయనకు వ్యవధి ఉంది.

పోలీసుచీఫ్: ఎఱ్ఱతలవాడా ?

నికోలాయ్: ఔను.... వెంటనే తగుచర్య తీసుకోండి.

పోలీసుచీఫ్: (సార్జెంటుతో) తక్షణం ఎఱ్ఱతలవాళ్ల నందరినీ, నిర్బంధించండి.

పోలీసు: చిత్తం, దేవరా !

పోలీసుచీఫ్: ఎఱ్ఱతల వాళ్లందర్నీను.

(పోలీసు బయటకు వెళ్లిపోతాడు)

క్లియోపాత్రా: (లోపలికి పరుగెత్తుకొనివచ్చి) ఎక్కడున్నారు ? మిషా ! ఏంజరిగింది ? స్పృహ తప్పిందా ? నికోలాయ్ వాస్సిలీవిచ్ ! ఆయనకు మూర్ఛ వచ్చిందా ? (నికోలాయ్ ప్రక్కకు తిరుగుతాడు) ప్రాణం పోయిందా ? చనిపోయారా ?

లెవ్‌షిన్: ఆయన శాశ్వతంగా కన్నుమూశారు. పనివాళ్లపైకి ఆయన పిస్తోలు గురి పెట్టారు, కానిఅది ఆయనపైకే యెదురు తిరిగింది.

నికోలాయ్: (కోపంతో పెదవులు బిగించి) నువ్వు అవతలికిపో ! (పోలీసు చీఫ్‌తో వీణ్ణి అవతలకి గెంటివెయ్యండి !

క్లియోపాత్రా: డాక్టర్ !........డాక్టరేంచెప్పాడు ?

పోలీసుఛీఫ్: (లెవ్‌షిన్‌తో తగ్గు గొంతుకతో) పోరా, బయటకుపో.
లెవ్‌షిన్: (మెల్లగా) వెడుతున్నాను, గెంటనక్కరలేదు.
క్లియోపాత్రా: (నెమ్మదిగా) చంపేశారు వాళ్లు!
పౌలీనా (క్లియోపాత్రాతో) ఓర్చుకోవమ్మా, తల్లీ!
క్లియోపాత్రా: (మెల్లిగానే, కాని పగతో) పొండి, నాయెదుటనుంచి. ....ఇదంతా మీపనే.... మీదే.
జఖార్: (విచారంతో) నువ్వు పుట్టెడు దుఃఖంలోవున్నావు.... గొప్పదెబ్బ....తీరని లోటు!....కాని నాపై నెంత వాదు వేస్తున్నావమ్మా!
పౌలీనా: (కన్నీటితో) శూలాల్లా గుచ్చుకునే మాట లంటున్నావు. నువ్వేమంటున్నావో ఆలోచించవమ్మా!
తాత్యానా: (పౌలీనాతో) నువ్వు వెళ్లిపోవమ్మా .... డాక్టరెక్కడున్నాడు?
క్లియోపాత్రా: మీ మెత్తదనమే మాకొంపతీసింది. ఆయన ప్రాణాలు బలిపుచ్చుకుంది.
నికోలాయ్; ఊరుకో, క్లియోపాత్రా! జఖార్ ఇవానోవిచ్ తాను చేసిన నేరాన్ని గుర్తించక పోరు.
జఖార్: (వ్యథతో) పెద్దమనుష్యులు....నాకిదేమీ బోధపడటంలేదు. మీరేమంటున్నారు? నాపై నెందు కిట్లా నింద వేస్తున్నారు?
పౌలీనా: ఇదిచాలా ఘోరం! మంచీ చెడ్డా ఆలోచించ వద్దూ?
క్లియోపాత్రా: మంచీ చెడ్డా అలోచించాలా?....కూలీలను రెచ్చగొట్టి మాఆయన పై మీరే ద్వేషం కలిగించారు.

అంతవరకూ ఆయనకున్న పలుకుబడినంతా ధ్వంసం చేశారు.....ఆయన పేరు చెబితే సింహస్వప్నం! అందరూ గడగడలాడిపోయేవారు ఇదివరకు! అట్టివాళ్లు యిప్పుడాయన ప్రాణాలే తీశారు. మీరే దీనికి కారకులు. మిమ్మల్నే నిందించాలి. ఆయన చావుకి బాధ్యత మీదే!

నికోలాయ్: చాలు, చాలు, గట్టిగా అరవకమ్మా.

క్లియోపాత్రా: (పౌలీనాతో): ఓహో! బుడిబుడి యేడుపులు సాగించావూ? చాలాబాగుంది. దొంగయేడ్పు! ఏడువు!

పోలీసు: (ప్రవేశిస్తో) దేవరా!

పోలీసుచీఫ్: ఉష్ నిశ్శబ్దం!

పోలీసు: ఎర్రజుట్టు వారినందర్నీ నిర్బంధించాం. (కాన్ను నెట్టుకుంటో, పెద్దగా నవ్వుతో సేనాని తోటలోకి వస్తాడు).

నికోలాయ్: ఉష్!

క్లియోపాత్రా: ఎవరు? హంతకులా!

(అవనిక)

# శత్రువులు



## రెండవ అంకం.

(పున్నమ చంద్రుని వెన్నెలకాంతి వలన తోటలో నీడలు దట్టంగా పడుతూంటాయి. భోజనాల బల్లపై రొట్టెలు, దోసకాయలు. గ్రుడ్లు, బీరు సీసాలు చెదురుగా పడివుంటాయి. కొవ్వొవత్తి దీపాలు వెలుగుతున్నాయి. అగ్రఫీనా పాత్రలను కడుగుతోంది. యగోడిన్ ఒక కుర్చీపైన కూర్చుని చుట్ట కాల్చుతున్నాడు. ఎడమ ప్రక్క తాత్యానా, నాద్యా, లెవ్‌షిన్‌లు మెల్లిగా మాట్లాడుతూంటారు. వాతావరణం విపత్సూచకంగా భారంగా ఉంటుంది.)

లెవ్‌షిన: (నాద్యాతో) పైసాపై ఆశతో మానవునికి సంబంధించిన వన్నీ పాప కలుషితమై పోయాయి, అమ్మాయి గారూ? అందుకనే మీ లేత హృదయం కూడా యింత భారంగా వుంది. మనుష్యు లందరూ రాగిపైసా అనే గొలుసుల్తో బధింపబడ్డారు. మీలో యింతవరకూ దురాశ పుట్టలేదు కనుకనే, యింకా స్వేచ్ఛగా వున్నారు. ఈ భూమిపై బ్రతికే ప్రతి మానవుడికీ గలగలమను శబ్దంతో దప్పు "నిన్ను నీవు ప్రేమించునట్లె, నన్ను ప్రేమించు" మనేసందేశాన్ని వినిపిస్తూంటుంది. కాని, మీరు దానికి అతీతులు కెండి! ఆశపాశాలకు లోబడరు. పిట్టల్లాగు స్వేచ్ఛగా విహరిస్తారు.

యగోడిన్: (అగ్రఫీనాతో) తనకంటె గొప్పవాళ్లకి నీతులు బోధించడం ఆరంభించాడు. లెవ్‌షిన్.... బుర్ర తిరుగుడు ముసిలాడు!

అగ్రఫీనా: ఏం, ఎందుకు చెప్పకూడదు? అతడు నిజమే చెబుతాడు. యదార్థ విషయాలు చెబితే గొప్పవాళ్ల కేమీ చెబుపు కలగదులే!

నాద్యా: నీకు జీవితం కష్టంగా గడుస్తోందా, లెవ్‌షిన్?

లెవ్‌షిన్: అట్టే యెక్కువ కష్టంగా లేదు. నాకు పిల్లా జెల్లా లేరు. నాకో ఆడది-అంటే పెళ్లాం వుంది. మా పిల్లలం దరూ చనిపోయారు.

నాద్యా: టాన్యా పిన్నీ! ఇంట్లో శవం వున్నప్పుడు అందరూ నోళ్లు నొక్కుకొని, గుసగుస లాడుతా రెందుకమ్మా?

తాత్యానా: నాకు తెలియదమ్మా.

లెవ్‌షిన్: (నవ్వుతో) మృతుల ముందు మన మందరమూ దోషులం అమ్మాయి గారూ! అందరూ దోషులే! అదే కారణం!

నాద్యా: కాని, ఇప్పుడు మామూలుకంటె విరుద్ధంగా వుంది.... సహజమైన చావు కాదు కదూ! బలవన్మరణం.... ఒక విశేషం యేమిటంటే, చచ్చిన మనిషి యెటు వంటివాడైనా ప్రజలుమాత్రం శవం వుండగా, మెల్లిగా గుసగుస లాడతారు.

లెవ్‌షిన్: అది కాదమ్మా తల్లీ! అందరినీ మనం చంపేస్తాం. కొందరిని తుపాకి గుళ్ళతోటి, మరికొందర్ని మాట ల్తోటీని. అందరినీ మన చేతుల్తోటి చంపుతాం. ఈ సూర్యకాంతినుంచి ప్రజల్ని వెన్నంటి తరిమి, మట్టి లోపడి గిట్టేట్లా చేస్తాం. చిట్టచివరకు మృత్యుదేవత

హస్తాల్లో చిక్కుకున్నాక కాని, మనకు మనం చేసే ఘోరాపరాధం తెలియదు. అప్పుడు మనకు పశ్చాత్తాపం కలిగి, మనపై మనకే యేవగింపు కలుగుతుంది. విపరీతభయం కలుగుతుంది. మనలో నీ కర్థం కావడంలేదూ దొరసానమ్మా? మన గతీ అంతే: మనల్ని తరుముతున్నారు. మనమూ స్మశానం వైపు పోతున్నాం.

నాద్యా: అవును. ఇది చాలా భయంకరమైన భావనే!

లెవ్‌షిన్: విచారించకు తల్లీ! నేడు భయంకరంగా కనపడుతుంది, రేపు మరిచేపోతాం! దీనినే స్మశాన వైరాగ్య మంటారు. మళ్ళీ యథాప్రకారంగానే ఒకరి నొకరు పడత్రోసుకుంటూ, కుమ్ములాడుకుంటూ వుంటారు. ఆ సమూహంలో, త్రొక్కిసలాటలో ఒకడు కింద పడిపోతాడు. మిగిలిన అందరూ ఒక క్షణకాలం రిచ్చపడి స్తబ్ధులౌతారు. ఒక నిటూర్పు విడిచి, మళ్ళీ యెప్పటి ఆట ప్రారంభిస్తారు. అజ్ఞానం! అయినా మీ కేమీ దోష మంటదమ్మా వెర్రి తల్లీ! చనిపోయిన మనుష్యులు నిన్నేమీ బాధించరు. శవాల యెదుట నిర్భయంగా నువ్వు మాట్లాడవచ్చు.

తాత్యానా: మన జీవిత విధానాన్ని యేవిధంగా మార్చుకోగలం? ఆ పద్ధతి నీకు తెలుసునా?

లెవ్‌షిన్: (నిగూఢంగా) పైసాను మటుమాయం చేయాలి. తన్ని నిలువు లోతులో పాతిపెట్టాలి. లోకంలోనుంచి

పైసా పిశాచం అంతర్ధానమైతే, ప్రజ లొకరి నొకరు యెందుకు మోసగించుకుంటారు? ఒకరిపై నొకరు యెందుకు శత్రుత్వం వహిస్తారు?

తాత్యానా: అంతేనా ... ?

లెవ్‌షిన్: ముందు దీనితో ప్రారంభిస్తే, మున్పాతికపంతు పని జరిగినట్టే!

తాత్యానా: తోటలో కొంచంసేపు తిరిగి వద్దామా నాద్యా?

నాద్యా: (ధ్యాన నిమగ్నయై) సరే. (వా రిద్దరూ తోట లోపలి భాగంలోకి వెడతారు. లెవ్‌షిన్ బల్లవద్దకు వెళతాడు. సేనాని, కాన్, పొలోగీలు గుడారపు ద్వారంవద్దకు వస్తారు.)

యగోడిన్: రాతి ప్రదేశంపై విత్తనాలు జల్లుతున్నావే, ముసిలాడా! నువ్వు శుద్ధ అమాయకుడవు.

లెవ్‌షిన్: ఎందుచేత ?

యగోడిన్: వీరికి బోధించేందుకు ప్రయత్నించడంలో అర్థంలేదు. నీవెర్రికాని, వారు బోధపరచు కుంటారా నువ్వు చెప్పేది? పనిచేసి జీవించేవాడికి అర్థమౌతుంది కాని, యీ శ్రీమంతుల చెవుల కెక్కుతాయా?

లెవ్‌షిన్: ఈపిల్ల చాల మంచిది. ఆమెను గూర్చి గ్రికోవ్‌నాతో చెప్పాడు.

అగ్రఫీనా: నీ కింకొక కప్పు టీ కావాలా?

లెవ్‌షిన్: నీకు శ్రమకాకపోతే.

(నిశ్శబ్దం. తర్వాత సేనాని గొంతుక వినిపిస్తుంది.

నాద్యా, తాత్యానాల తెల్లదుస్తులు చెట్లమాటునుండి కనిపిస్తుంటాయి)

సేనాని: లేకపోతే, ఒక త్రాడుతీసికొని, రోడ్డుకడ్డంగా- యీవిధంగా—యెవ్వరూ చూడకండా—కట్టాలి. దారిన పోయే వాడి సంగతి చూసుకో— కాలికి తగిలి ....ముందుకు బోర్లా పడతాడు కపీమని: హ్హా! హ్హా. హా!

పొలోగీ: ఎవరైనా పడుతోంటే చూడటానికి బలేగమ్మత్తుగా వుంటుంది దేవరా!

యగోడిన్: వింటున్నావా?

లెవ్‌షిన్: అంతా పూర్తిగా వింటున్నాను.

కాన్: ఇంట్లో శవం వుండగా, అట్టిపని యీరోజున మనం చేయకూడదు. హాస్యపు పనులు చేయకూడదు మనం.

సేనాని: ఓహో! నాకు నీతులు నేర్పకోయ్. నువ్వు చచ్చిన రోజున నేను నృత్యం చేస్తాను. (నాద్యా, తాత్యానాలు బల్లవద్దకు వస్తారు)

లెవ్‌షిన్: ఈ వృద్ధుడు కాటికి కాళ్లు చాచుకు కూర్చున్నాడు.

అగ్రఫీనా: (ఇంటివైపు వెడుతో) చూడండి, చంటిపిల్లాళ్లని మించిపోయి అల్లరి చేస్తాడు.

తాత్యానా: (బల్లవద్ద కూర్చుని) చెప్పవయ్యా, నువ్వు సోషలిష్టువా?

లెవ్‌షిన్: (అమాయకంగా) నేనా? కాదు. నేనూ టిమోఫీ-మేమిద్దరమూ బట్టనేతగాళ్లం. అదీ నేతపనివాళ్లం.

తాత్యానా: నీ కెవ్వరైనా సోషలిష్టులు తెలుసా? పోనీ, వారిని గూర్చి విన్నావా?

లెవ్‌షిన్: ఔను, విన్నాము.... మాకెవ్వరితోటీ పరిచయమైతే లేదుగాని, వారిని గూర్చివిన్నాము.

తాత్యానా: ఆఫీసులో పనిచేస్తున్న సింజోవ్‌ను యెరుగుదువా?

లెవ్‌షిన్: ఎరుగుదుమమ్మా, మాకు తెలుసును. ఆఫీసులోపనిచేసే వారినందరినీ యెరుగుదుము.

తాత్యానా: ఆయనతో యెప్పుడైనా మాట్లాడావా?

యగోడిన్: (నసుగుతో) ఆయనతో మేమేమి మాట్లాడతాం? ఆయన మేడమీద ఆఫీసులో పని చేసుకుంటూంటారు. మేము కింద వుంటాము. ఎప్పుడైనా ఆఫీసుకి పిలిచి, డైరెక్టరు పురమాయించిన పనిసంగతి చెబుతూంటారు, అంతే. అంతకుమించి మాకేమి పరిచయం వుంటుంది ఆయనతో?

నాద్యా: మేమంటే భయపడుతోన్నట్లు కనిపిస్తోంది లెవ్‌షిన్! భయపడకు. మాకీ విషయాలంటే చాలా ఆసక్తి. శ్రద్ధ....

లెవ్‌షిన్: మాకు భయమెందుకమ్మా? మేమేమి చెడ్డ పనిచేశాం? ఇక్కడకు వచ్చి అల్లర్లు జరుగకుండా, కాపలా కాయమని అడిగారు. మే మా పని చేస్తున్నాం. అవతల పనివాళ్లందరూ మతిచెడి వున్నారు. ఈఫ్యాక్టరీని, కనపడిన ప్రతిదాన్ని కాల్చి దగ్ధం చేసివేస్తామంటు న్నారు కోపంలో వాళ్లు. కాని మాకు మాత్రం,

యీపిచ్చిపని అంగీకారం కాదు. కాల్చి భస్మీపటలం చేయనక్కరలేదు. ఐనా, ఎందుకు చెప్పండి ఫాక్టరీని కాల్చి సర్వనాశనం చెయ్యడం? వీటిని మేము, మాతండ్రులు, తాతలు కట్టాము .... అకస్మాత్తుగా ఇప్పుడు వీటిని కాల్చి మసిచెయ్యాలట!

తాత్యానా; దురుద్దేశ్యంతో నిన్నీ విషయాలు అడుగుతున్నామని అనుకోవని, ఆశిస్తున్నాను.

యగోడిన్: మీ కేం దురుద్దేశం వుంటుదమ్మా? ఎవ్వరికీ యేమీ అపకారం తలపెట్టముగా మేము.

లెవ్‌షిన్: మే మీవిధంగా భావిస్తాం. ప్రజలేమి నిర్మించినా అవి పవిత్ర మైనవే! మనకు ప్రజల శ్రమపై గౌరవ ముండాలి, వాటి విలువను గుర్తించాలి. కాని, వస్తువులను దగ్ధం చేయకూడదు. కాని ప్రస్తుతం ప్రజల బుర్రలు చీకటి కోణాల్లాగున్నాయి. వారికి మంటలంటే సరదా. పైగా క్షణంలో వెర్రెత్తి పోతారు. ఈ చనిపోయిన ఆయన మాపై చాలా కఠినంగా వున్నమాట వాస్తవమే ననుకోండి! చచ్చిన మనిషిపై క్రోధం వహించడంలో అర్థ మేముంది చెప్పండి? ఆయన మమ్మల్ని కాలుస్తానని ....పిస్తోలు లాడిస్తో బెదరించారు.

నాద్యా: మాపిన తండ్రి మంచివాడేనా?

యగోడిన్: జఖార్ ఇవానోవిచ్చా?

నాద్యా: ఔను ఆయనే. మీపై దయగా వుంటారా? లేక

ఆయన కూడా కఠినుడేనా ?

లెవ్‌షిన్: ఆమాట మే మనగూడదండీ.

యగోడిన్: (చిరాకుగా) : నాఉద్దేశ్యంలో వారందరూ సమానమే. కఠినులూ, దయగలవారూ కూడాను !

లెవ్‌షిన్: (నెమ్మదిగా): కఠినుడూ యజమానే, జాలిగుండె వాడూ యజమానే. రాచపుండుకు వ్యక్తుల రక్త మాంసాలను హరించడమే వృత్తి గాని, వీరూ వారూ అన్న విచక్షణ యెందుకుంటుంది?

యగోడిన్: (విసుగ్గా) : జఖార్ ఇవానోవిచ్‌కు జాలిగుండె వున్న మాట యదార్థమే ననుకోండి............

నాద్యా: ఆయన స్క్రాబొటోవ్ కంటె మంచివాడనే నీఅభి ప్రాయం కదూ ?

యగోడిన్: (మృదువుగా) కాని ఆ డైరెక్టరు యిక బ్రతికున్న వారిలో లేడుకదా !

లెవ్‌షిన్: మీ పినతండ్రిగారు మంచివారే కాని, అయన మంచి తనం వల్ల మాకు కలిగే ప్రయోజనం శూన్యం అమ్మాయి గారూ....

తాత్యానా: (కోపంతో) మనం వెడదాం, రా నాద్యా. వీళ్ళ మనల్ని సరిగా అర్థం చేసుకోలేదని బోధపడటం లేదూ నీకు?

నాద్యా: (నెమ్మదిగా) ఔను........(మాట్లాడకుండా వారు వెళ్ళిపోతారు. లెవ్‌షిన్ వారు వెడుతూన్నదిక్కు చూస్తూ తర్వాత యగోడిన్ వైపు చూస్తాడు. వారిద్దరూ (నవ్వుకుంటారు)

యగోడిన్: విసుగు పుట్టించారుకదూ ?

లెవ్షిన్: వినలేదూ ? వారికి విషయాలంటే శ్రద్ధ హెచ్చుట !

యగోడిన్: వారి మాటలకు మోసపోయి, మనం నోరు జారతా మేమోనని వీరి ఉద్దేశం.

లెవ్షిన్: ఆ చిన్న పిల్ల చాలా మంచిది. శ్రీమంతుల యింట పుట్టడమే ఆమె చేసుకున్న పాపం.

యగోడిన్: యీ వొరసాని కూపీ తియ్యాలని మహాలయము వేస్తోందని మత్వీనికోవేవిచ్‌తో చెప్పాలి.

లెవ్షిన్: ఆయనతోనూ, గ్రికోవ్‌తోనూ కూడా చెబుదాం.

యగోడిన్: పరిస్థితు లెట్లా వున్నాయంటావ్ ? వారు మనకు లొంగి తీరాలి........

లెవ్షిన్: లొంగుతారు. మళ్లీ త్వరలోనే మన భరతమూ పడతారు.

యగోడిన్: మనప్రాణాలు తోడేస్తారు.

లెవ్షిన్. ఆమాట అక్షరాలా నిజం.

యగోడిన్: నిద్రతో కళ్లు కూరుకొని పోతున్నాయి.

లెవ్షిన్: ఒక్కక్షణం ఆగు. ఇదుగో, సేనాని వస్తున్నాడు. (సేనాని వస్తాడు. గౌరవ పురస్సరంగా తగుదూరంలో బొలోగి నిలబడతాడు. వారి వెనుక కాన్ వస్తాడు. అకస్మాత్తుగా బొలోగీ సేనాని చెయ్యి పట్టుకుంటాడు.)

సేనాని: ఏమి టది ?

బొలోగీ: భూమిలో పెద్ద గొయ్యి తవ్వారు, దేవరా !

సేనాని: ఊహూ ! ఈబల్లమీన అన్నీ చెదిరి పడివున్నాయే మిటి ? మీరిక్కడ కూర్చుని తింటున్నారా ?

యగోడిన్: ఔనండి అయ్యా!....దొరసానులతోకలసి ..........
సేనాని: ఐతే, మీరు కాపలా కాసేందుకు వచ్చారా ?
యగోడిన్: చిత్తం... మేము పహరా ఇస్తున్నాం.
సేనాని: బాగుంది గవర్నరుతో మీసంగతి చెబుతాను. మీరెంత మంది గస్తీ తిరుగుతున్నారు?
లెవ్‌షిన్: మేమిద్దరము.
సేనాని: ఓరిశుంఠా! నాకళ్ల ముందుఉన్న మీయిద్దర్నీ నేను లెక్కపెట్టలేనూ? మొత్తం మీరెంతమంది కాపలా కాస్తున్నారని నాప్రశ్న.
యగోడిన్: ముప్పైమంది.
సేనాని: మీకు ఆయుధా లున్నాయా ?
లెవ్‌షిన్: నీ దగ్గరవున్న పిస్తోలు యేదీ టిమోఫీ ?
యగోడిన్: ఇదుగోనండీ.
సేనాని: మూతి వైపు పట్టుకుంటావేమిరా, శుంఠా! కాన్! వీళ్లిద్దరికీ పిస్తోలు పట్టుకోవడంనేర్పు. (లెవ్‌షిన్‌తో) నీదగ్గర రివాల్వరు ఉందా ?
లెవ్‌షిన్: లేదు. అది నాకెందుకండీ ?
సేనాని: తిరుగుబాటువార్లు వస్తే, వారిపైకి కాలుస్తారా ?
లెవ్‌షిన్: ఈ ఫాక్టరీ మూసివేనందుకు........వాళ్ళకి చాలా కష్టంగా వుంది లెండి....అందులో చాలమందికి పిల్లలు కూడా వున్నారు.
సేనాని: యేమిటిరా నువ్వు ప్రేలేది? నువ్వు కాలుస్తావా అని అడిగాను నిన్ను.

లెవ్ షిః: ఓ, మేము సిద్ధంగా వున్నాం దేవరా! మేము ఎందుకు కాల్చము! ఇంతకీ పిస్తోలు కాల్చడం మాకు చేతకాదు. పైగా నా కో రివాల్వరు గాని, ఫిరంగైనా లేదు కదా.

సేనాని: కాః! వీళ్ళకి పిస్తోలు పేల్చడం నేర్పు....నదిదగ్గరకు

కాః: (విసుగ్గా) అప్పుడే రాత్రి పొద్దుపోయిందని మనవి దేవరా! ఈ సమయంలో మనం కాల్చడం మొదలు పెట్టితే ప్రజలు ఖంగారుపడి యేమి జరుగుతోందో చూదామని యిక్కడికి వచ్చేస్తారు. మీఆజ్ఞ ఐతే వెడతాను. నేను సర్వదా సిద్ధమే.

సేనాని: అయితే రేపటివరకు వాయిదా వేశాస్లే.

లెవ్ షిః: రేపటి కంతా సర్దుబాటై, శాంతంగా వుంటుంది. ఫాక్టరీ రేపు తెరుస్తారు.

సేనాని: యెవరు తెరుస్తారు?

లెవ్ షిః: జఖార్ ఇవానోవిచ్. ఆవిషయాన్నిగూర్చే యిప్పుడు పనివాళ్లతో ఆయన మాట్లాడుతున్నారు.

సేనాని: దీనిదుంప తెగ! నామాట చెలామణీ ఐతే ఈఫాక్టరీని శాశ్వతంగా మూయించి పారేశేవాణ్ణి. పొద్దు పొడవకుండానే చెవులు గింగుర్లెత్తేట్లా కూసే యీ ఫాక్టరీ యీలల గోల లేకుండా పోను.

యగోడిః: ఇంకా ప్రొద్దుపోయాక కూస్తే మాకూ ఇష్టమేనండీ!

సేనాని: తిండి లేకుండా చేసి, మాడ్చిపారేద్దును. మీతిరుగు

బొట్లు. గల్లంతులు. నాదగ్గర సాగుతాయా?

లెవ్ షిఁ: మేమేమి తిరుగుబాటు చేశామండీ?

సేనాని: మాట్లాడకు! ఇక్కడేం చేస్తున్నార్రా మీరు? ఈప్రహరీ చుట్టూ గస్తీ తిరుగుతో యెవరైనా పాకివస్తోంటే వాళ్ళని పేల్చి పారెయ్యండి. అటుపైసంగతి నేను చూసుకుంటాను. ఆ బాధ్యత నాది.

లెవ్‌షిఁ: రా, వెడదాం. టీమోఫీ! నీ పిస్తోలుకూడా తీసుకురా.

సేనాని: పిస్తోలు! బుర్రతక్కువ గాడిదలు! తుపాకిని, తుపాకీ అని పిలవడం చేతగాని శుంఠలు!

పొలోగీ: దేవరా! సర్వ సామాన్యంగా, ప్రజాసామాన్యం చదువు సంధ్యలు లేని మొరటులని మనవి చేసుకుంటున్నాను. నావిషయం చూడండి. నేనొక తోటవేసి, కష్టపడి స్వయంగా కూరగాయలు పండిస్తున్నాను.

సేనాని: చాలా మంచిపని చేస్తున్నావు. బాగుంది.

పొలోగీ: నా తీరిక సమయం అంతా ఈపనికే వినియోగిస్తాను.

సేనాని: 'కృషితోనాస్తిదుర్భిక్షమ్'. అందరూ పనిచేయవలసిందే.

తాత్యానా: (దూరంనుంచి) ఎందుకు అంత బిగ్గరగా మాట్లాడుతున్నావ్?

సేనాని: వీళ్ళు నాప్రాణాలు విసిగించేస్తున్నారు. (పొలోగీతో) సరే ఐతే?

పొలోగీ: ప్రతిరాత్రి కూలీలు నా శ్రమఫలితాన్ని దోచుకుంటూ వుంటారు....

సేనాని: దొంగిలిస్తారా?

పొలోగీ: సరిగాఅంతే దేవరా! నేను చట్టముల రక్షణ కోరాను. కాని, ఈప్రాంతంలో పోలీస్ ఇనస్పెక్టరు దొరవారే శాంతి భద్రతలను కాపాడవలసిన అధికారి. ఐతే ఈవ్యక్తి మాత్రం ప్రజావసరాలను లక్ష్యం చేయరు...........

తాత్యానా: (పొలోగీతో) అంతంత పెద్ద పదాలను దొర్లిస్తా వెందుకు మాటల్లో?

పొలోగీ: (తొట్రుపాటుతో) అలాగునా? క్షమించండి. మూడు సంవత్సరాలు కళాశాలలో చదువు కున్నాను. అంతే కాకుండా వార్తా పత్రిక కూడ క్రమం తప్పక చదువు తూంటాను.

తాత్యానా: (చిరునవ్వుతో) అదీ కారణం!

నాద్యా: నువ్వు బలే వింతమనిషివి, పొలోగీ!

పొలోగీ. మీకు నామూలంగా ఆనందం కలిగితే నాకు సంతోషం. ప్రతి వ్యక్తి పరుల కానందం కలిగించేందుకు కృషి చెయ్యాలి.

సేనాని: నీకు చేపలు పట్టడం యిష్టమేనా?

పొలోగీ: నే నెప్పుడూ ప్రయత్నించలేదు దేవరా.

సేనాని: (బుజాలెగురవేసి) చాలా వింత సమాధానమే!

తాత్యానా: చేపలు పట్టడమా? ఇష్ట పడటమా? దేనికి ప్రయత్నించ లేదు?

పొలోగీ: (తొట్రుపాటుతో) ముందు చెప్పిన పనిని.

తాత్యానా: ఐతే రెండవ దాన్నో?

పొలోగీ: రెండవ దానిని చేసేందుకు ప్రయత్నించాలి?

తాత్యానా: వివాహం చేసుకున్నావా?

పొలోగీ: ఆ సౌఖ్యంకోసం స్వప్నాలు కంటున్నాను. నాకు నెలకు ఇరవై అయిదు రూపాయలు జీతమే కనుక (నికోలాయ్, క్లియోపాత్రాలు వేగంగా ప్రవేశిస్తారు) ఇంతవరకూ అందుకు సాహసించలేకపోయాను.

నికోలాయ్ (కోపంతో) ఆశ్చర్యం! ఎంత దుస్థితి!

క్లియోపాత్రా: ఎంత దుస్సాహసం! ఎంత అఘాయిత్యపు పని చేశాడు. (గట్టిగా అరుస్తో) మీ మేనల్లుడు ఒట్టి పిరికి పంద! చవట! నా భర్త హంతకులకు- ఆ తిరుగు బాటుదార్లకు లొంగిపోయి వాళ్ళ కోర్కెలన్నీ తీర్చాడు.

నాద్యా: (మృదువుగా) అందరూ హంతకులు కాదు కదమ్మా.

క్లియోపాత్రా: ఆయన శవాన్ని అపహాస్యంపాలు చేశాడు. నన్ను కూడా అందరిలోను నవ్వులపాలు చేశాడు. ఆలోచించి చూడండి యేంచేశాడో! ఇంకా శవానికి అంత్య క్రియ లైనా చేయలేదు. ఏఫాక్టరీ నైతే మూసివేశా దని ఆమనిషి నిండు ప్రాణాలు తీసివేశారో, ఆఫాక్ట రీనే తెరిచేశాడు.

నాద్యా: కనపడిన దల్లా కాల్చి బూడిద చేస్తారని మాబాబాయి భయ పడ్డాడమ్మా.

క్లియోపాత్రా: ఈ సమ్మెదార్లకు నాయకత్వం వహించి, సలహా లిస్తోన్న గుమాస్తా ఒకడున్నాడు. వాడి కెంత గుండె నిబ్బరమో చూడండి! ఈ చనిపోయిన ఆయన రెచ్చ

గొట్టడం వల్లనే ఈఘోరం జరిగిందంటాడు.

నికోలాయ్: (తన వ్రాతపుస్తకంలో యేదో వ్రాసుకుంటూ) అతనిపై నాకు చాలా అనుమానంగా వుంది. వాడు మామూలు గుమాస్తారకం కాదు. వాళ్ళ తలదన్నిన అసాధ్యుడు...........................

తాత్యానా: సింజోన్‌ను గురించేనా మీరు మాట్లాడేది?

నికోలాయ్: ఔను.

క్లియోపాత్రా: నాముఖం మీద యెవరో వుమ్మివేసినట్లు బాధగా వుంది.

పొలోగీ: (నికోలాయ్‌తో) మీ అనుజ్ఞతో మనవి చేసుకుంటు న్నాను. ఈ సింజోన్ ప్రతి దినమూ వార్తాపత్రిక చదివేటప్పుడు, అధికారుల నందరినీ చాలా తీవ్రంగా విమర్శిస్తూంటాడు. రాజకీయాలు చర్చిస్తాడు.

తాత్యానా: (నికోలాయ్‌తో) ఈతని మాటలు వినాలని కుతూ హలంగా వుందా మీకు?)

నికోలాయ్: (ఉద్రిక్త స్వరంతో) పరమ కుతూహలంగా ఉంది.... నన్ను వేధించ దల్చుకున్నారా, మీరు?

తాత్యానా: ఈ పొలోగీ ఇక్కడ వుండవలసినవాడు కాదని నా ఉద్దేశ్యం.

పొలోగీ: (తొట్రుపాటుతో) క్షమార్పణ కోరుకుంటున్నా నమ్మా.... వెళ్ళిపోతున్నాను. (త్వరగా నడచి వెళ్ళి పోతాడు)

క్లియోపాత్రా:ఇక్కడికి వస్తున్నాడు. అతని ముఖం చూడలేను....

నాయెదుట ఉండడమే భరించలేను. (ఎడమ వైపుకు వేగంగా వెళ్ళి పోతుంది)

నాద్యా: ఏమి టీ తంతు?

సేనాని: ఈ గందరగోళం నేను భరించలేను. నావయస్సు మీరింది. హత్యలు, దొమ్మీలు, తిరుగుబాట్లు. ఇక్కడకువచ్చి విశ్రాంతి తీసుకొమ్మని ఆహ్వానించి నప్పుడు పరిస్థితు లిట్లా విషమిస్తాయని జఖార్ ముందుగానే తెలిసికొని ఉండవలసింది.

(జఖార్ ప్రవేశిస్తాడు. ఉద్రేకంగా వున్నా, సంతోషంగా వున్నాడు. నికోలాయ్‌ని చూచి, తొట్రుపడి కండ్ల అద్దాలను సర్దుకుంటాడు).

సేనాని: వినవయ్యా, మేనల్లుడా....నువ్వేంచేశావో, గుర్తించావా?

జఖార్: ఒక్క క్షణం ఆగు, మామా! నికోలాయ్‌వాస్సిలీవిచ్!

నికోలాయ్: ఆఁ!

జఖార్: పనివారంతయూ ఉద్రేకంతో ఉడికిపోతున్నారు. ఈ ఫాక్టరీనంతా ధ్వంసం చేస్తారేమోనని భయపడ్డాను .... అందుచేత ఫాక్టరీని మూసివేయ వద్దన్నవారి కోరికను నెరవేర్చాను. డిష్కోవ్ విషయంలోకూడా దోషిని పట్టి వప్పగించే షరతుపైనే డిష్కోవ్‌ను తీసివేసేందుకు అంగీకరించాను. దోషిని వప్పగించేందుకు వారు అంగీకరించారు.

నికోలాయ్: (విరసంగా) వాళ్ళు కష్టపడ నక్కరలేదు. వారిసహాయం లేకుండానే, హంతకుణ్ణి మనం పట్టుకోగలం.

జఖార్: వాళ్ళు పట్టుకోడమే మంచిదని నాకు తోచింది .... అన్నివిధాలా అదే బాగుంటుంది....రేపు మధ్యాహ్న భోజనానంతరం ఫాక్టరీ తెరిచేందుకు మనం ఒప్పుకున్నాం.

నికోలాయ్: మనంఅంటే-మీఉద్దేశ్యంలో యెవరు?

జఖార్: నేను.

నికోలాయ్: ఆహా, ఈసమాచారానికి చాలా అభివందనాలు. ఏది ఎల్లావున్నా, మాసోదరుని మరణం తరువాత నేను, ఆయన భార్య ఆయనస్థానంలో వ్యవహరించాలని అనుకుంటాను. మీరే స్వయంగా నిర్ణయింపకుండా మాతోకూడా సంప్రదించి ఉండవలసింది.

జఖార్: మిమ్మల్ని రమ్మని కబురు పంపానుకదా! సింట్జోవ్ మీకోసంరాగా మీరు రానని తిరస్కరించారు.

నికోలాయ్: నాసోదరుడు మరణించిన నాడు వ్యాపారాన్ని గూర్చి ఆలోచించడం కష్టంగా వుంటుందనే విషయాన్ని మీ రంగీకరించి తీరాలి.

జఖార్: కాని, మీరు ఫాక్టరీకి వెళ్ళనే వెళ్ళారుగా!

నికోలాయ్: ఔను, వెళ్ళాను. వారి ఉపన్యాసాలు వింటున్నాను. వెళ్ళితే నేం.

జఖార్: నామాట సరిగా అర్ధం చేసుకోండి. చనిపోయిన డైరెక్టరు సైన్యాన్ని పంపమని బస్తీకి తంతి పంపించినట్టుగా కనిపిస్తోంది. రేపు ఉదయానికి సైనికులొస్తారని జవాబు వచ్చింది...........

సేనాని: అఁహాఁ, సైనికులా? అదీ సరైనమాట! సైనికులు రంగంమీద వుండగా పిచ్చి, పిచ్చి గంతులు కుదరవు.

నికోలాయ్; చాలా తెలివైన చర్య!

జఖార్: నాకు ఆ ధీమా లేదు. సైనికులు రాగానే కూలీలు మరింత రెచ్చిపోతారు .... ఫాక్టరీని తెరువకపోతే వా శ్ళేం చేస్తారో పరమాత్ముడికే తెలియాలి! నేను సరైన పనే చేశానని నాకు తోస్తోంది. రక్తాన్ని చిం దించే సంఘర్షణ ఐనా తప్పింది కనీసం.

నికోలాయ్: ఈ సమస్యను నేను ఇంకోవిధంగా చూస్తాను. మా మృత సోదరుని యందు మీకు ఈషణ్మాత్రం గౌరవమున్నా, ఆ .. ప్రజలు కోరిన కోరికలన్నీ, మీరు మంజూరు చేయకూడదు.

జఖార్: ఈ గొడవంతా మరీ విషమించివుండేదనే విషయం మీరు గుర్తించ రెందుచేత?

నికోలాయ్: ఈ పరిస్థితులకూ, నాకూ యేమీ సంబంధం లేదు.

జఖార్: యదార్థమే. ఐతే నా సంగతేమిటి? ఈ పనివాళ్ళతో జీవించవలసిన వాడను నేను. వాళ్ళరక్తం ఒక్క బొట్టయినా నేలమీద రాలితే .... ఈ ఫాక్టరీనంతా భస్మీ పటలం చేసివేస్తారు.

నికోలాయ్: నాకు నమ్మకం లేదు.

సేనాని: నేనూ నమ్మను.

జఖార్: (నిరుత్సాహంగా) ఐతే నేను చేసిన పనికి, నన్ను

నిందిస్తున్నా రన్నమాట?

నికోలాయ్: ఔను, విధిగా.

జఖార్: (నిష్కపటంగా) ఎందుచేత? వారిపైన మనకెందుకీ పగ? నేను కోరుకునేదల్లా ఒక్క విషయం మాత్రమే-ఆసన్నమైన భీభత్సాన్ని తప్పించడమే! రక్తపాతాన్ని నేను కోరను. శాంతియుతమైన, సక్రమమైన జీవిత విధానాన్ని అమలు జరపడం వాస్తవానికి అసాధ్యమా? మీరు నన్ను యేవగించుకుంటున్నారు. కూలీలు నన్ను నమ్మడంలేదు... నాకు తోచినంతలో సబబుగా నడుచుకోవాలవి మాత్రమే నాకోరిక.

సేనాని: ఏది సబబో, యేది బేసబబో యెవరి కెరుక? అది ఒక పదంకూడా కాదు, కొన్ని అక్షరాల కూడిక మాత్రమే. 'స' అంటే సన్నటి 'బ' అంటే బడితెతో 'బు' అంటే బుర్ర పగల గొడుతాను, అన్నమాట. కాని, వ్యాపారమంటే వ్యాపారమే! ఔనంటావా, కాదంటావా?

నాద్యా: (కండ్లనీరుపెట్టుకుని) ఊరుకో తాతా! బాబాయ్. .... శాంతించు, ఆయనకు బోధ పడదులే....నికోలాయ్ వాస్సిలీవిచ్! మీరు బాబాయిని అపార్థం చేసుకుంటారేమండీ? మీరెంతో తెలివైన వారు....మాబాబాయిని విశ్వసించండి.

నికోలాయ్: క్షమించండి, జఖార్ ఇవానోవిచ్! నేను వెళ్ళిపోతున్నాను. పెద్దలు వ్యవహారాలు మాట్లాడు తున్నప్పుడు

చిన్న పిల్లలు జోక్యం చేసుకోవడానికి నేను అలవాటు పడలా. (నిష్క్రమిస్తాడు)

జఫార్: చూచావా, నాద్యా!....

నాద్యా: (ఆయన చేతిని పుచ్చుకొని) ఏమీపరవాలేదు. వీటిని లెక్కచేయకు బాబాయ్! పనివాళ్ళు సంతృప్తిగా వుండటమే ప్రధానమైన విషయం..... మనకంటె వా రెన్ని రెట్లో ఎక్కువమంది వున్నారు. వారి యిష్టానిష్టాలు కూడా మనం గమనించాలి.

జఫార్: ఒక్క క్షణం ఆగు....నీపై నాకెంతో కోపం వచ్చింది నాద్యా!....చాలా?

సేనాని: నాకూ కోపంగానే వుంది.

జఫార్: పని వాళ్ళంటే నీకు అభిమానం వుంది. నీ యీడులో అది సహజమేలే. ఐతే, కొద్ది, గొప్పల తారతమ్యం ఉండాలా, అక్కర్లేదా? ఆ గ్రికోవ్‌సు భోజనాల బల్ల వద్దకు తీసుకొస్తావా? వాణ్ణి నేనెరుగుదును. చురుకైన కుర్రాడే. అయినా మీ పినతల్లితో కజ్జా పెట్టుకొని, రభస చేసేందుకు నీకు హక్కు లేదు.

సేనాని: అదీ, అట్లా బుద్ధిచెప్పు.

నాద్యా: అదంతా యెట్లా జరిగిందో నువ్వు పూర్తిగా వినలేదు బాబాయ్!

జఫార్: నీకంటె మాకెక్కువ లౌకికజ్ఞానం వుంది. మనం పని వాళ్ళకి కాస్త చనువిస్తే నెత్తికెక్కి కూర్చుంటారు.

తాత్యానా: (నెమ్మదిగా) మునిగిపోయే మానవుడు గడ్డిపరక

పట్టుకున్నట్టు....

జఖార్: ఈ పాటకపుజనం జంతువుల్లాగే పరమ లోభులు. వారికి సత్క్రమ ప్రవర్తన క్రమక్రమంగా నేర్పాలేగాని, ఎక్కువ స్వేచ్ఛ నిచ్చి పాడుచేయ కూడదు. అదీ సంగతి. ఈ విషయం సావకాశంగా ఆలోచించుకో.

సేనాని: ఇక నేను చెప్పదలచుకున్నది చెప్పేస్తాను. ఈ చిలిపి పిల్ల మహా పెట్రేగి పోయింది. నాకే నీతులు చెప్పొస్తోంది. ఏయ్ పెంకిపిల్లా! ఇంకా నల్భై యేళ్లు గడిస్తేనే కాని, వయస్సులో నన్నందుకోలేవని గుర్తుంచుకో. నీక్కూడా అంతవయస్సు వస్తేనే కాని, నాతో సమానస్థాయిలో నిన్ను మాట్లాడనివ్వను తెలిసిందా? కాన్!

కాన్: (చెట్లమధ్యనుంచి) ఇక్కడ వున్నాను దేవరా!

సేనాని: ఎక్కడ వున్నాడు....ఆపిడత ...అటిక పిడత?

కాన్: ఏ అటిక పిడత?

సేనాని: వాడు....ఏమంటారూ వాణ్ణి?....పిడత!

కాన్: ఓహో! పొలోగియా?....నాకు తెలియదండి.

సేనాని: (గుడారంవైపు వెడుతూ) ఎక్కడున్నాడో వెతికి పట్టుకురా.

(తలవాల్చి జఖార్ పచార్లు చేస్తుంటాడు. కండ్ల అద్దాలను చేతి రుమాలుతో తుడుచుకుంటూ వుంటాడు. అతన్ని పరిశీలనగా చూస్తూ తాత్యానా నిలబడుంటుంది.)

తాత్యానా: చంపిన వాళ్ళెవరో తెలిసిందా?

జఖార్: తెలియదట కాని, తెలిసికొని చెబుతా మన్నారు. నిజానికి వాళ్లకి తెలుసు. (చుట్టుప్రక్కల చూచి స్వరం తగ్గిస్తాడు) వారిలో వారు ఆ నిశ్చయానికి వచ్చారు. అది అంతా ఒకపెద్ద కుట్ర. నిజం చెప్పాలంటే, ఆయన వారిని చాలా వేధించి, విసిగించి వేశాడు. రక్త మాంసాలూ, వాంఛలూ ఉండే మనుష్యుల్లాగే చూసేవాడు కాదు. అధికార దర్పం ఆయన్నొక జాడ్యంలాగా పట్టుకుంది. అందువల్లే వారు- భయంకరమైన విషయమే నను కో- చంపివేశారు. ఇంత ఘోరం చేసికూడా మనకేసి నిర్భయంగా, పాపభీతి లేకుండా చూస్తారు ఏపాపకర్మ చేయనట్లే! ఇవన్నీ ఆలోచిస్తూంటే నాగుండె ఆగిపోయే టట్టుంది.

తాత్యానా: స్క్రాటొటోవ్ వారిని కాల్చబోతోంటే వారిలో ఒకడు రివాల్వరు చేతిలోనుంచి లాగుకున్నాడని చెబుతున్నారు.

జఖార్: అది అంత ముఖ్యవిషయం కాదు. వాళ్లే ప్రాణాలు తీసిన హంతకులు. అంతేకాని. అతడుకాదు.

నాద్యా: కూర్చోవేం బాబాయ్?

జఖార్: సైనిక పటాలాల కొరకు యెందుకు కబురు చేశాడు? ప్రతి విషయమూ తెలిసి పోతున్నట్లుగానే, యీవిషయమూ అప్పుడే కూలీలకు తెలిసిపోయింది. అదే అతని చావుకు కారణమైంది. ఫాక్టరీని తెరవక తప్పిందికాదు. తెరవకపోతే, నాకూ కార్మికులకూ

మధ్యనుండే సామరస్యం చెడి, పరిస్థితులు మరింత విషమిస్తాయి. ఇట్టి ఉద్రిక్త పరిస్థితుల్లో పనివాళ్లను ఆదరాభావంతో చూడాలి.... ఈ గొడవ అంతా చివరికి యెట్లా ముగిసేదో యెవరికి తెలుసు? ఈ స్థితిలో కార్మికులకు విశ్వాస పాత్రులైన స్నేహితు లుండటం అత్యవసరం. (లెవ్‌షిన్ దూరంలో కనిపిస్తాడు) ఎవరావచ్చేది?

లెవ్‌షిన్: మేము! .... కాపలా కాస్తున్నాం.

జఖార్: సరే బాగుంది. లెవ్‌షిన్! మీరొక మనిషి ప్రాణాలు బలిపుచ్చు కున్నారు కనుక శాంతించినట్లున్నారే!

లెవ్‌షిన్: మేమెప్పుడూ అంతే, జఖార్ ఇవానిచ్!.... స్వతహాగా శాంతిప్రియులం.

జఖార్: (నిందా పూర్వకంగా) ఔనయ్యా, ఔను. మీరు శాంత స్వభావులు కనుకనే, ప్రజలను చంపుతారు. లెవ్‌షిన్! నువ్వు కొన్ని విపరీతభావాలను ప్రచారం చేస్తున్నావని తెలుస్తోంది. డబ్బు ఉండకూడదనీ, యజమాను లవసరంలేదనీ, యీరకమైన క్రొత్త భావాలు వ్యాపింప జేస్తున్నావు. లియో టాల్‌స్టాయ్‌లాంటి మహాపురుషుడు యిట్టి సిద్ధాంతాలు బోధించాడంటే అర్థం వుంది. కాని, నువ్వు యిట్టిప్రచారాన్ని కట్టిపెడితే నే మంచిది. ఇలాంటి మాటలవలన మేలుకలుగదు.

(తాత్యానా, నాద్యాలు కుడివైపునుంచి ప్రవేశిస్తారు. ఆవేపునుంచే సింజోవ్, యాకోవ్‌ల కంఠాలు

వినవస్తాయి. చెట్లవెనుకనుంచి యగోడిన్ వస్తాడు. )

లెవ్‌షిన్: (శాంతంగా) ఏంమాటలు? నాజీవితంలో అనేక ధక్కా మొక్కీలు తిని చాలా అనుభవం గడించాను. స్వయంగా ఆలోచించి, తోచినదే చెబుతూంటాను.

జఖార్: యజమానులు క్రూరహృదయులు కారు. మీ రా విషయం గుర్తుంచుకోవాలి. నేను క్రూరుణ్ణి కానన్న విషయం మీకు తెలుసును. మీకు సహాయం చేసేందుకు నేను సర్వదా సంసిద్ధున్నే. సబబైన పనిచేసేందుకే యెల్లప్పుడూ ప్రయత్నిస్తుంటాను.

లెవ్‌షిన్: (నిట్టూర్చి) తనకుతాను అపకారం చేసుకోవాలనుకునే వ్యక్తి యెవ్వరైనా వుంటారా?

జఖార్: మీకు మంచిని చేయాలని నేను కృషిచేస్తోన్న విషయం మీరు గుర్తించలేదూ?

లెవ్‌షిన్: గుర్తించామనుకోండి.

జఖార్: (సునిశితంగా పరిశీలిస్తో) లేదు, నువ్వు పొరబడుతున్నావు. మీ రా విషయం యీషణ్మాత్రమూ గుర్తించలేదు. మీరెంత వింతమనుష్యులు! కొన్నిసమయాల్లో పశుతుల్యులు, మరికొన్ని సమయాల్లో పసిపాపలవంటి అమాయకులు. (నిష్క్రమిస్తాడు. తనకర్రపై వానుకొని లెవ్‌షిన్ ఆయన వైపే చూస్తుంటాడు.)

యగోడిన్: నీతి సూత్రాలు వల్లిస్తున్నాడా?

లెవ్‌షిన్: ఈయ నొక చైనామనిషి. నిజమైన చైనామనిషి! చెప్పదలచుకున్న దేమిటి? చెప్పేదేమిటి? తనని తప్ప

యితరులను యెప్పుడూ అర్థం చేసుకోలేడు.

యగోడిన్: తాను చాలా మంచివాడనీ, మేలు చేసేందుకే ప్రయత్నిస్తాననీ చెబుతున్నాడు.

లెవ్‌షిన్: అదీ అసలు సంగతి.

యగోడిన్: మనం పోదాం పద, వాళ్లిటే వస్తున్నారు.

(లెవ్‌షిన్, యగోడిన్‌లు తోట లోపలిభాగంలోకి వెళ్లిపోతారు.)

నాద్యా: స్వప్నంలో మాదిరిగా మనం వర్తులాకారంగా గిరగిరా తిరుగుతున్నాం.

తాత్యానా: కొద్దిగా పలహారం తీసుకుంటూరా, మత్వేనికోవిచ్?

సింజోవ్: కొద్దిగా టీ పుచ్చుకుంటాను. నాగొంతుక బొంగురుపోయేటట్లు, యెడా తెరిపీ లేకుండా యీపూటమంతా మాట్లాడాను.

నాద్యా: మీకు దేనినిగూర్చి భయంలేదూ?

సింజోవ్: (బల్లవద్ద కూర్చుంటో) నాకా? భయమెందుకు? దేనిని గూర్చీ భయపడను.

నాద్యా: నాకు చాలా భయం వేస్తోంది. అకస్మాత్తుగా ప్రతిదీ తలక్రిందులుగా కనిపిస్తోంది. ఎవరు మంచివారో, ఎవరు చెడ్డవారో తెలుసుకో లేకుండా వున్నాను.

సింజోవ్: (చిరునవ్వుతో) ఆచిక్కు విడిపోతుంది. నిర్భయంగా వ్యక్తులనుగూర్చి, పరిస్థితులనుగూర్చి విమర్శించుకోండి. ఏదో నిర్ణయానికి వచ్చేవరకూ తుదకంటా ఆలోచించండి. దేన్నిగూర్చీ భయపడవలసిన అగత్యంలేదు.

తాత్యానా: శాంతపరిస్థితు లేర్పడ్డాయా?

సింజోవ్: ఆఁ! కార్మికులు యెన్నడోగాని విజయం పొందరు. ఆ అపురూపమైన విజయం యెంత చిన్నదైనా వారు ఉబ్బి తబ్బిబ్బు లై పోతారు.

నాద్యా: మీకు కార్మికు లంటే యెంత ప్రేమ!

సింజోవ్: అది తగిన పదంకాదు. వారితో కలసి చాలాకాలం జీవించాను. వారినీ, వారి బలాన్నీ సంపూర్ణంగా గుర్తించాను. వారి శక్తి-యుక్తులందుకూడా నాకు అచంచలమైన విశ్వాసం వుంది.

తాత్యానా: భవిష్యత్తు వారికే చెందుతుందని కూడానా?

సింజోవ్: ఔను. దానియందుకూడా నాకు నమ్మకముంది.

నాద్యా: భవిష్యత్తు! .... అ దేమిటోకూడా నే నూహించలేక పోతున్నాను.

తాత్యానా: (నవ్వుతో) మీ శ్రామికులు బలే యుక్తిపరులు. నేనూ, నాద్యా వారితో మాట్లాడేందుకు ప్రయత్నించాము. కాని, ప్రయోజనం లేకపోయింది.

నాద్యా: ఇ దేమంత బాగుందో చెప్పండి! ఆ వృద్ధుడు మాతో మాట్లాడినంతసేపూ, మమ్మల్ని చాలా చెడ్డవాళ్లలాగో, గూఢచారుల్లాగో అనుమానిస్తోనే మాట్లాడాడు. కాని ఇంకొక డున్నాడు- గ్రికోవ్- అతడు ప్రవర్తించే తీరే వేరు. కాని, ఆ ముసిలాడు మాపై జాలిపడుతోన్నట్లు, మేము జాడ్యగ్రస్తులంలాగానూ నవ్వుతో మాట్లాడాడు.

తాత్యానా: అంత హెచ్చుగా త్రాగడం మానుదూ యాకోవ్! చూసేందుకు చాలా అసహ్యంగావుంది.

యాకోవ్: నేను వేరే చేయవలసిం దేముంటుంది?

సింజోవ్: వేరే చేయవలసిందే వుండదంటారా?

యాకోవ్: నాకు వ్యాపారమన్నా, వ్యాపారానికి సంబంధించిన వ్యవహారాలన్నా సరిపడవు. చూశారూ, నేను మూడవ తరగతికి చెందినవాణ్ణి.

సింజోవ్: దేనికి?

యాకోవ్: మూడవ తరగతికి. ప్రజలు మూడు రకాలు. మొదటి తరగతికి చెందినవారు తమ జీవిత కాలమంతా కష్టించి పని చేస్తోనే వుంటారు. రెండవ శ్రేణి వారు డబ్బు కూడ బెడతారు. ఇక మూడవ వర్గం వాళ్లు - ఎవరి తిండి కోసం వారే పనిచేయడంలో అర్థంలేదు కనుక - పనేచేయరు, కూడ బెట్టటం బుద్ధితక్కువపని కనుక పోగుచేయనూ ఇష్టపడరు. నే నీ మూడవ తరగతికి చెందినవాణ్ణి. సోమరులు, తిరుగుబోతులు, సాధులు, సన్యాసులు, ముష్టివాళ్లూ, త దితర పరాన్న భుక్కులూ యీ శ్రేణికి చెందినవారే.

నాద్యా: విసుగు పుట్టిస్తున్నావు బాబాయ్! నువ్వు ఆ రకమైన వాడివి కాదు. నువ్వు వట్టి జాలిగుండె మనిషివి .... మెత్తని మనస్సు నీది.

యాకోవ్: వేరే మాటల్లో చెప్పాలంటే, ఎందుకూ పనికిరానివాడి నన్నమాట! ఆ విషయం నేను బడిలో చదువుకునే రోజుల్లోనే గుర్తించాను. యుక్తవయస్కులయ్యేలోపు గానే, ప్రజలు యీ మూడు శ్రేణుల్లో ఏదో ఒక

దానిలో చేరిపోతూంటాయి.

తాత్యానా: మీరు విసుగు పుట్టిస్తున్నారని నాద్యా చెప్పినమాట నిజమే.

యాకోవ్: నేనూ ఒప్పుకుంటున్నాను. మట్వేనికోవేవిచ్! జీవితానికి ముఖం వుందని మీరు భావిస్తున్నారా?

సింజోవ్ ఉండొచ్చు.

యాకోవ్: ఉంది. దానిముఖం యెల్లప్పుడూ కళకళలాడుతూ పడుచుతనపు మిస మిసలతో ప్రకాశిస్తుంది. కొద్దికాలం క్రితం వరకూ జీవితం నాపట్ల తూష్ణీభావం వహించింది. కాని యీమధ్య నావేపు కఠినంగా చూస్తో "ఎవ్వరు నువ్వు? ఎక్కడికీ ప్రయాణం?" అంటూ పదే పదే ప్రశ్నిస్తోంది. (దేన్ని తలుచుకునో భయం చెందుతోన్నట్లు కనపడతాడు. నవ్వటానికి ప్రయత్నించగా పళ్లు కటకట కొట్టుకుంటాయి. ముఖం వివర్ణమౌతుంది.)

తాత్యానా: ఓ, ఆపేద్దూ యాకోవ్!.... ఇరుగో ప్రాసెక్యూటరు వస్తున్నారు. ఆయన యెదుట ఇలాంటి మాటలు అన వద్దని కోరుతున్నాను.

యాకోవ్: సరేలే!

నాద్యా: (మృదువుగా) ప్రతివారూ యేదో సంభవిస్తుందని యేదో సంభవిస్తుందని యెదురు చూస్తో, భయ విభ్రాంతులై వున్నారు. కార్మికులతో నన్నెందుకు స్నేహం చేయనీయరు?....బుద్ధి తక్కువ!

నికోలాయ్: (వచ్చి) నేనొక కప్పు టీ త్రాగనా?

తాత్యానా: ఆహాఁ, తప్పకుండాను.

(కొద్ది క్షణాలు అందరూ నిశ్శబ్దంగా వుంటారు. టీ కలుపుకుంటో నికోలాయ్ నిలబడి వుంటాడు.)

నాద్యా: కార్మికులు మాబాబాయిని నమ్మకపోవడానికి కారణం తెలుసుకోవాలని వుంది నాకు, పైగా సర్వసాధారణంగా............

నికోలాయ్: (చిరచిరలాడుతూ) "ప్రపంచ కార్మికులారా! ఏకముకండి" అనే విషయంపై ఉపన్యాసాలు దంచేవారిని నమ్ముతారు. వారంటే పరమ విశ్వాసంతో వుంటారు.

నాద్యా: (భుజాలెగురవేసి నెమ్మదిగా) ఈ నినాదాలు- ప్రపంచాన్నంతటినీ సవాలుచేసే యీనినాదాలు విన్న ప్రతి పర్యాయమూ....మన దోటిగాళ్లంవరూ ఒట్టి దండుగ, అనావశ్యకపు మనుష్యుల మనిపిస్తుంది నాకు ........

నికోలాయ్ (ఉద్రేకంతో) ఔను, నిజమే! సంస్కృతి కల ప్రతి వ్యక్తీ ఆవిధంగానే భావించాలి. సంస్కృతికల ప్రపంచ ప్రజలారా! ఏకముకండు! అనే మరొక సవాలుకూడా అచిర కాలంలోనే వినపడుతుం దనుకుంటాను. ఇప్పటికే చాలా కాలం వృధాగా గడచి పోయింది. కాబట్టి, తక్షణమే యీఉద్యమాన్ని, బయల్దేరతీయాలి. వేలకొలది సంవత్సరాలనుండి సంచితం చేసిన నాగరికతా ఫలితాలను పదదళితంచేసి మట్టిలో కలపి వేసేందుకు ఆటవికులు, అనాగరికులు వస్తున్నారు, వస్తున్నారు,

దురాశతో, ధనలోభంతో!

యాకోవ్: ఆత్మలను వారి ఖాళీ పొట్టల్లో భరిస్తారు. (ఒక గ్లాసులో బీరు పోసుకుంటాడు.)

నికోలాయ్: ప్రజా సమూహం పేరాసతో, అందరూ ఏకమై రంగ లార్చుకుంటూ వస్తున్నారు.

తాత్యానా: (ఆలోచనాపూర్వకంగా) ప్రజా సమూహం... మూక! ప్రతిచోటా ప్రజానీకం! .... నాటక శాలల్లో — దేవళాల్లో....

నికోలాయ్. ఈ ప్రజ లీయు గలిగిన వివాళ మేమిటి? విధ్వంసంతప్ప వేరేలేదు. మనమధ్య, యీదేశంలో జరిగేటంత విధ్వం సం మరెక్కడా జరుగనంత భయంకరంగా వుండబో తుందనే విషయాన్ని గుర్తుంచుకోండి!

తాత్యానా: కార్మికులు చాలా అభివృద్ధి చెందిన ప్రజ లని వా రన్న ప్పుడల్లా నాకు పరమాశ్చర్యం కలుగుతుంది. కార్మి కుల వాస్తవిక స్థితికీ, వీరు చెప్పేదానికీ హస్తిమశ కాంతరం వారవుంది.

నికోలాయ్: ను వ్వేమంటావ్ సింజోవ్?— ఔనుకే, నువ్వు మాతో ఏకీభవించవు.

సింజోవ్: (గంభీరంగా) ఏకీభవించను.

నాద్యా: టాన్యా పిన్నీ, పైసానుగూర్చి ఆ ముసలివాడు చెప్పింది నీకు జ్ఞాపకం వుందా? వాస్తవానికి అది అతి సరళంగా వుంది.

నికోలాయ్: మాతో ఏ కారణంచేత ఏకీభవించరు, సింజోవ్ గారూ?

సింజోవ్: నా దృక్పథం వేరు కనుక.

నికోలాయ్: చాలా సబబైన సమాధానం. నీ భావాలు మాకు చెప్పకూడదూ?

సింజోవ్: నాకు అవసరమని తోచడంలేదు.

నికోలాయ్: నాకు చాలా విచారం కలిగింది. పోనీ మనం మరొక పర్యాయం కలుసుకున్నప్పుడైనా నీవైఖరిని మార్చు కుంటావేమోననే ఆశతో ప్రస్తుతానికి ఊరటచెందు తున్నాను. యాకోవ్ ఇవానోవిచ్! మీరు అన్యథా భావించకుండా వుంటే, నాతో కూడా రమ్మని కోరు తున్నాను. ఈరోజున నా దేహం నా వశంలోలేదు.

యాకోవ్: (కష్టంపై లేచి నిలబడి) సంతోషంతో.... సంతోషంతో (నిష్క్రమిస్తారు.)

తాత్యానా: ఆ ప్రాసిక్యూటరు చాలా రోతమనిషి. అతని అభి ప్రాయాలతో ఏకీభవించగలగడం కష్టం!

నాద్యా: (లేస్తూ) ఐతే, అతను చెప్పినవానికల్లా బుర్ర వూపడ మెందుకో?

సింజోవ్: (నవ్వుతో) ఎందుకు వూపారు, తాత్యానా పావ్లోనా?

తాత్యానా: నేనూ అదేవిధంగా భావిస్తున్నాను కనుక.

సింజోవ్: (తాత్యానాతో) ఆయన చేసిన విధంగా మీరు భావిస్తారు కాని, మీ హృదయంమాత్రం వేరు విధంగా వుంటుం ది..మీరు విషయాలను అర్థం చేసుకోవాలని కోరుతారే కాని, ఆయన పరులను, పరుల భావాలను లెక్క చెయ్యడు. ఆయనకు అర్థంచేసుకోవలసిన అగత్యమూ

కనుపించదు.

తాత్యానా: ఆయన చాలా క్రూరు డనుకుంటాను.

సింజోవ్: ఔను. క్రూరుడే. పట్టణంలో రాజకీయ కేసు లన్నిటి లోనూ ప్రభుత్వం తరఫున ఆయనే వాదిస్తాడు. నిర్బంధితుల యెడల ఆయన అవలంబించే వైఖరి అసహ్యం కలిగిస్తుంది.

తాత్యానా: మిమ్మల్నిగురించి ఆయన వ్రాత పుస్తకంలో యేదో వ్రాసుకున్నాడు.

సింజోవ్: (నవ్వుతో) అందుకు సందేహించ నక్కరలేదు. పొలోగీతో నన్నుగూర్చి మాట్లాడాడు. ఆయన కత్తి నూరి పదును పెట్టుకుంటున్నాడు.... తాత్యానా పావ్లోనా! నాకొక కోరికవుంది, మన్నిస్తారా?

తాత్యానా: సాధ్యమైన దేదైనా వుంటే సంతోషంతో చేస్తాను.

సింజోవ్: అనేక వందనాలు. సైనికులను పిలిపించినట్లు వినికిడిగా వుంది.

తాత్యానా: ఔను, పిలిపించారు.

సింజోవ్: అందరి యిళ్లూ సోదా చేస్తారన్నమాట!.... నా వస్తువులు కొన్నిటిని మీరు దాచిపెట్టగలరూ?

తాత్యానా: మీ యిల్లుకూడా సోదా చేస్తా రనుకుంటున్నారా?

సింజోవ్: ఆహా, తప్పకుండా చేస్తారు!

తాత్యానా: మిమ్ము నిర్బంధిస్తారా?

సింజోవ్: నిర్బంధించకపోవచ్చు. ఏ కారణం చూపుతారు? నేను ఉపన్యాసాలు యిస్తున్నాననా? నా ఉపన్యాసా లన్నిటి

లోనూ కార్మికులను సక్రమంగా ప్రవర్తించమని కోరానని, జఖార్ యివానోవిచ్ యెరుగుదురు.

తాత్యానా: మీ గత చరిత్రలో రాజద్రోహ సంబంధమైన దేదీ లేదుకదా?

సింజోవ్: నాకు గత చరిత్రే లేదు.........నాకీ చిన్ని సహాయం చేయగలరా? వీటిని దాచిపెట్టగలిగే వారందరి గృహాలను రేపు సోదా చేస్తారనే అనుమానం లేకపోతే, మీకీ కష్టం కలిగించను. (నెమ్మదిగా నవ్వుతాడు.)

తాత్యానా: (సంకోచిస్తూ) నేను దాపరికం లేకుండా చెపుతాను.... ఈ యింట్లో నాకీయబడిన గదిని, నా స్వంత గదివలె ఉపయోగించుకొనే స్వతంత్రమే లేదు నాకు.

సింజోవ్: వేరే మాటల్లో చెప్పాలంటే, నాకు సహాయం చేయలేరన్నమాట! సరే....

తాత్యానా: అన్యథా భావించకండే!!

సింజోవ్: వేరేవిధంగా యెందుకు భావించాలి? మీ తిరస్కారానికి కారణం లేకపోలేదుగా?

తాత్యానా: ఐతే, కొద్ది క్షణాలు ఆగండి! నాద్యానుకూడా అడుగుతాను. (వెడుతుంది. ఆమెవైపు చూస్తో, బల్లపైన పద్దెల వాయిస్తూంటాడు. సమీపంలో అడుగుల సవ్వడి వినవస్తుంది.)

సింజోవ్: (నెమ్మదిగా) ఎవరది?

గ్రికోవ్: నేను, మీ రొక్కరే వున్నారా?

సింజోవ్: ఔను. కాని యిటూ అటూ మనుష్యులు తిరుగుతూనే

వున్నారు. ఫాక్టరీవద్ద కొత్త విశేషా లేమిటీ?

గ్రికోవ్: (చిరునవ్వు నవ్వి) తుపాకి కాల్చినవాడిని పట్టి యిస్తా మని అంగీకరించారు కదూ, అందుకని యిప్పుడు పరిశోధనలు సాగిస్తున్నారు. సోషలిస్టులు కాల్చారని కొందరు గొడవ చేస్తున్నారు. మొత్తంమీద ప్రతి వాడూ తన ప్రాణాలు రక్షించుకోవాలని తాపత్రయ పడుతున్నాడు.

సింజోవ్: కాల్చిన దెవరో నీకు తెలుసునా?

గ్రికోవ్: అకిమోవ్.

సింముప్: నిజంగానే!.... అయ్యో, నే నెన్నడూ అనుకోలేదు, యీవిధంగా జరుగుతుందని. అతడు చాలా మంచి వాడూ, తెలివైనవాడూను.

గ్రికోవ్: అతడు మంచి ఉద్రేకపరుడు. బహిరంగంగా అంగీక రించి లోబడిపోదా మనుకుంటున్నాడు. అతనికి భార్య, ఒక పిల్లవాడూను. మళ్ళీ గర్భిణి. నెలయికూడా నిండి నాయి.... ఇంతకు క్రితమే లెవ్‌షిన్‌తో మాట్లాడాను. అర్థంలేకుండా మాట్లాడాడు. అకిమోవ్ స్థానే అకి మోప్ కంటె తక్కువ ప్రాధాన్యం కలవాడు తుపాకి పేల్చాడని చెప్పాలంటాడు.

సింజోవ్: వింత మనిషి! కాని, యెంత విషమంగా పరిణమిం చిందీ పరిస్థితి! (కొంచెమాగి) విను గ్రికోవ్! అన్నీ జాగ్రత్తగా భూమిలో పాతిపెట్టాలి.... ఇం కెక్కడా స్థలంలేదు వాటిని దాచేందుకు.

గ్రికోవ్: నేనొక స్థలం చూశాను. టెలిగ్రాఫ్ ఆపరేటరు వీటన్నిటినీ దాచేందుకు అంగీకరించాడు, కాని, మత్వేసీకోవేవిచ్! మీ రిక్కడనుంచి దాటిపోతే మంచిది.

సింజోవ్: వెళ్ళను, ఇక్కడనుంచి వెళ్ళను.

గ్రికోవ్: మిమ్మల్ని సైనికులు నిర్బంధిస్తారు.

సింజోవ్: ఐతేనేమిలే! ఇప్పుడు నేను వెళ్ళిపోతే కార్మికులు చాలా దురభిప్రాయ పడతారు.

గ్రికోవ్: ఆ మాట వాస్తవమే. కాని, మీరు వాళ్ళ చేతులకు చిక్కకూడదు.

సింజోవ్: తెలివి తక్కువమాట! అకిమోవ్‌ను గురించే నేను విచారపడుతున్నాను.

గ్రికోవ్: ఔను. మనం చేయగలిగిన సహాయం కూడా లేదు. లోబడిపోదా మనుకుంటున్నాడు. యజమాని ఆస్తిపాస్తుల సంరక్షణకుని పాత్రలో మిమ్ములను చూస్తుంటే, నవ్వు వస్తోంది.

సింజోవ్: (చిరునవ్వుతో) తప్పనిసరి. మనవాళ్లంవరూ నిద్రపోతున్నా రనుకుంటాను.

గ్రికోవ్: అన్ని విషయాలూ చర్చించేందుకు ఒకచోట సమావేశ మయ్యారు. అద్భుతమైన రాత్రి యిది!

సింజోవ్: నీతో కూడా రావాలని వుంది కాని, నేనిక్కడ వుండాలి. నిన్నుకూడా నిర్బంధిస్తా రనుకుంటాను.

గ్రికోవ్: ఐతే మన కిద్దరకూ చెరసాల వాసం ఒకే పర్యాయం. నేను శెలవు తీసుకుంటాను. (నిష్క్రమిస్తాడు.)

సింజోవ్: శెలవు, (తాత్యానా ప్రవేశిస్తుంది.) మీరేమీ శ్రమపడ కండి, తాత్యానా పావ్ లోనా! అన్ని యేర్పాట్లూ నేనే చేసుకున్నాను. శెలవు!

తాత్యానా: నాకు చాలా విచారంగావుంది.

సింజోవ్: శెలవు.

(నిష్క్రమిస్తాడు. మౌనంతో తాత్యానా పచారుచేస్తూ, తన కాలి జోళ్ళవంక దీక్షగా చూస్తూవుంటుంది. యాకోవ్ ప్రవేశిస్తాడు.)

యాకోవ్: ఇంకా నిద్రపోలేదేం?

తాత్యానా: నిద్ర రావడంలేదు. ఇక్కడినుంచి వెళ్ళిపోవాలని వుంది.

యాకోవ్: ఊహుఁ! నాకు సంబంధించినంతవరకూ, వెళ్లి పుండేందుకు నాకు వేరే తావులేదు. నేను అన్ని ఖండాలూ దీవులూ చుట్టుముట్టాను.

తాత్యానా: ఇక్కడ నామనస్సుకు స్థిమితంగా లేదు. నా బుర్ర మొద్దుబారి పోతోంది. అబద్ధ మాడవలసిన బలవంతపు పరిస్థితుల్లో పడ్డాను. అబద్ధాలను సహించడం కష్టం.

యాకోవ్: ఊహుఁ! నువ్వు అబద్ధాలను సహించలేవు. నామర దృష్టం.

తాత్యానా: (తనలో తాను) కాని యిప్పుడే నే నొక అబద్ధ మాడాను. సహజంగా ఆ వస్తువులను దాచేందుకు నాద్యా అంగీకరించి వుండును. కాని ఆమెను ఆ

పంథాలో నడిపించే హక్కు నాకు లేదు.

యాకోవ్: దేన్ని గురించి మాట్లాడు తున్నావు?

తాత్యానా: నేనా? అబ్బే. దేన్ని గురించీ లేదు. ఎంత వింతగా వుందీ యీ వ్యవహారమంతా! కొద్ది కాలం క్రితం వరకూ జీవితమంతా సాఫీగా సాగిపోయింది. కాని యిప్పుడో, నాకేమి కావాలో తెలియని విషమ పరిస్థితిలో పడ్డాను....

యాకోవ్: (నెమ్మదిగా) అయ్యయ్యో! త్రాగుబోతు కళారాధకులూ, రూపసులైన తిరుగుబోతులూ, తదితర కులాసా వృత్తుల వాళ్లూ నీ దృష్టిని యిక ఆకర్షించలేకపోతున్నారు. జీవిత తతంగానికి దూరంగా వున్నంత వరకూ మేము ప్రజలకు వినోదాన్ని కలిగిస్తూనే వున్నాం. ఐతే యీ తతంగం క్రమంగా నాటకం వలె మారుతోంది. "ఓయి హాస్య గాళ్లూ, రంగస్థలం దిగి బయటకు పొండి!" అంటూ ఎవరో అరుస్తున్నారు. కాని రంగస్థలం నీకు క్షేత్రం టాన్యా!

తాత్యానా: నా క్షేత్రమా? ఔను, నే నొకప్పుడు నాట్య రంగంలో నాకు ప్రబలమైన స్థానం వుందనీ, అత్యున్నత శిఖరాల నందుకోగలననీ, అనుకునే దాన్ని! (శక్తి వంతంగానూ, బాధతోనూ) "ఇదంతా మాకు తెలుసును. పాత కథే! విసుగు పుడుతోంది" అంటోన్నట్లుగా నిరుత్సాహపు మూగ దృక్కులు నాపైకి సారించే ప్రేక్షకులను చూస్తూంటే, నాకు చాలా

తొ్రుపాటూ, దుఃఖమూ కలుగుతున్నాయి. వారి ముందు దుర్బలు రాలనై, ని స్తేజురాలనై పోతు న్నాను. వారిదృష్టి సరికట్టి, భావ లోకంలో ఉజ్జ్యూతి లూగించలేకపోతున్నాను. ఆనందంతోనూ, భయం తోనూ కంపించిపోవాలనీ, వారిని అగ్నివలె భగ్గు మని జాజ్వల్యమానంగా రగిల్చి, ప్రచండమైన ద్వేషం, ఉద్రేకాలను కలిగించే పదాలను ప్రేక్షకు లతో అనాలనీ అనిపిస్తుంది. అసిధారవలె తీక్షణమూ, జ్యోతివలె జాజ్వల్యమానమూ అయిన పటిష్ఠమైన పదాలను పలకాలనే ప్రబలమైన వాంఛ కలుగు తోంది.....

కాని అట్టి శక్తిసంతమైన పదజాలమే లేదు. నా ప్రే క్షకులు జ్వాలలా లేచి, ప్రభంజనంలా విజృంభిం చాలనే ఆశ తీవ్రంగా చెలరేగుతోంది.... భావోద్రిక్తు లైన వారిని వ్యూహకలూపి, ఆపి, వారిపై చల్లటి పూలజడి వంటి పదాలను ప్రయోగించి, ఆశ, ప్రేమ, ఆనందమూ కల్గించాలని కాంక్షిస్తున్నాను. పదముల ప్రభావంలో నే నేడ్చి వారి నేడిపిస్తాను. నాకండ్ల వెంట రాల్చే అశ్రువు లెంత ఆకర్షణీయాలు! ఆ ప్రేక్షక బృందమంతా మైమరచి, నన్ను అభినందించి నా పై పువ్వుల వర్షం కురిపిస్తారు. చేతులతో ఆకాశానికి లేవనెత్తుతారు. ఒక్క క్షణం వారి నందరినీ నా పదప్రయోగశక్తికి వశ్యులను చేసి

వుందును. అదే నా జీవితంలో మేలైన క్షణంగా-అమర క్షణంగా అలరారి వుండును! నా జీవిత మంతా కరిగి, ఆ ఒక్క క్షణంలో మూర్తీభవించి యుండును! ఐతే, ఏవీ, అట్టి సజీవ పదార్థం? లేవు! లేవు!!

యాకోవ్: మన అందరికీ ఒక్క ముహూర్తకాలం మాత్రమే జీవించడం తెలుసును.

తాత్యానా: జీవితంలోని మహత్తర విషయాలన్నీ ఒక్క ముహూర్త కాలంలోనే సంభవిస్తాయి. ప్రజలందరూ వేరువిధంగా జీవించాలనీ, జీవితం యింతకంటె తక్కువ నిరర్థకంగా వుండాలనీ, నే నెంతగానో కాంక్షిస్తున్నాను. లలిత కళలకు అగ్రస్థాన మిచ్చే జీవితం - అందరికీ అన్నివేళలా కళారాధన, కళోపాసన నిత్య వాంఛితాలుగా అలరారే ఆనందమయ జీవితం లభ్యమైతే, అట్టి ఆహ్లాదకరమైన జీవిత రంగంలో నాకు తగిన స్థానముంటుంది....(యాకోవ్ అంధకారంలోకి విస్ఫారిత నయనాలతో చూస్తూంటాడు) నువ్వెందు కింత హెచ్చుగా తాగుతున్నావు? ఆత్మహత్య చేసుకుంటున్నావు. ఒకప్పుడు నువ్వు చాలా అందంగా వుండేవాడవు!

యాకోవ్: ఆవిషయం మరచిపో.

తాత్యానా: నా కెంతో వ్యథ కలుగుతోం దన్నైనా గుర్తించావూ?

యాకోవ్: (భయంతో) నే నెంత తాగివున్నా, నాకు సమస్తమూ బోధపడుతోంది. అది నా దురదృష్టం! నా బుర్ర

ఆలోచిస్తూనే వుంటుంది. సర్వకాల సర్వావస్థల్లోనూ. సర్వదా ఒక విశాల వదనం- మలిన వదనం- పెద్ద కండ్లతో నావైపు చూచి "బాగుందా" అని ప్రశ్నిస్తోంది. "బాగుందా?" అన్నమాట ఒక్కటే!

పౌలీనా: (పరుగునవచ్చి) టాన్యా! దయయుంచి, ఇట్లారా, టాన్యా! క్లియోపాత్రాకు మతిపోయింది. అందరినీ అనరాని మాటలు అంటో, అవమాన పరుస్తోంది. ఆమెను నువ్వు శాంతపరచగలుగుతావేమో, చూడు!

తాత్యానా: (బాధగా) మీ గొడవల్లోకి నన్ను దింపకమ్మా. త్వరత్వరగా ఒకరి నొకరు నమలకుండా మింగు కోండి; కాని యిటూ అటూ పరుగెత్తి. మనుష్యుల కాళ్లకి అడ్డు పడకండి!

పౌలీనా: (కంగారుపడి) టాన్యా! మతిపోయిందా, ఏంమాటలివి?

తాత్యానా: నీ కేం కావాలమ్మా?

పౌలీనా: ఆమెకేసి చూడు! ఇక్కడికే వస్తోంది.

జఖార్: (రంగం వెనుక) శాంతించు! నిన్ను వేడుకుంటు న్నాను. నీకు పుణ్యముంటుంది కాని, ఊరుకోవమ్మా!

క్లియోపాత్రా: నాయెదుట నోరు మూసికొని పడి వుండవలసింది నువ్వు కాని, నేను కాదు.

జఖార్: (ప్రవేశిస్తో) ఆఖరికి నాకు మతి పోతుందేమోనని భయంగా వుంది.

క్లియోపాత్రా: (వెన్నంటివచ్చి)! నా దగ్గరనుంచి పారిపోదా మను కుంటున్నావేమో.... అది కుదరదు .... నామాట విని

తీరవలసిందే. కూలీల గౌరవం సంపాదిస్తామని యీ పన్నాగం పన్నావు. కుక్కలకి మాంసంముక్క వేసే ట్లు, కూలీలకు ఒక మానవ జీవితాన్ని యెరగా పడేశావు. ఇతరుల రక్తం పెప్పించి, మంచివాడిలాగా, నువ్వు- కరుణార్ద్ర హృదయుడవులాగ కనిపించాలని యీ యెత్తు యెత్తావు.

జఖార్: ఈవిడ మాట్లాడుతున్న దేమిటి?

యాకోవ్: (తాత్యానాతో) నువ్వుకూడా వెళ్లిపోవడం మంచిది. (నిష్క్రమిస్తాడు)

పౌలీనా: ఏమమ్మోయ్, దొరసానమ్మా! ఇట్లామాటు. మేము పరువు ప్రతిష్ఠలు కల గౌరవనీయులం! నీ బోటి గౌరవ మర్యాదలు లేని ఆడదానిచేత మాటలుపడం.

జఖార్: (అదరిపడి) నువ్వూరుకో, పౌలీనా! ఎందుకొచ్చిన గొడవ!

క్లియోపాత్రా: మీరు మర్యాదస్తులని యెవ్వరన్నారు? ఏవో రాజ కీయాలు వాగుతూంటారు కనుకనా? ప్రజల బాధలు, అభివృద్ధి, మానవత్వం అంటారు కనుకనా?

తాత్యానా: క్లియోపాత్రా పెట్రోనా! ఇక చాలించు, చాలు!

క్లియోపాత్రా: నేను నీతో మాట్లాడటం లేదు. నీకు యిక్కడ సంబంధం లేదు. ఇది నీకు సంబంధించిన వ్యవహారం కాదు....నాభర్త చాలా సన్మార్గుడు. యథార్థవాది. ప్రజలను మీకంటె ఆయనే బాగా యెరుగును. మీవలె యెందుకూ కొరగాని మాటలు చెబుతో,

కూలీలవెంట ఆయన తిరగలా. మీ తెలివి తక్కు వతో మోసగించి ఆఖరికి ఆయన ప్రాణాలు తీయించారు.

తాత్యానా: (జఖార్, పౌలీనాలతో) మీ రిక్కడనుంచి వెళ్లిపొండి.

క్లియోపాత్రా: నేనే వెడతాను. మీరంటే నాకు పరమ అసహ్యం.... మీ సరసను కూర్చునేందుకే నాకు ఒళ్లు కంపరమెత్తుతోంది. (నిష్క్రమిస్తుంది.)

జఖార్: చూడు! మహా దొడ్డయిల్లాలు! మతిపోయింది.

పౌలీనా: (కండ్లనీరు పెట్టుకొని) మనం యిదంతా వదులుకుని వెళ్లిపోదాం, ఈ పీడ వదుయితుంది. అయ్యయ్యో!.... మంచీ, మర్యాదా లేదు. మనుష్యులను తృణప్రాయంగా తీసిపారేసి, అవమాన పరుస్తోంది.

జఖార్: ఆమె యింత మితి మీరిపోయేందుకు కారణమేమిటి?... తనభర్తను ప్రేమించివుండినా లేక కనీసం ఆయనతో తృప్తిగా జీవించి వురిడినా,....కాని ఏడాదికి కనీసం యిద్దరు నూతన ప్రియులతో కాలం గడిపిన యీ మహా పతివ్రత, మొగుడు చచ్చాక యెంత రభస చేస్తోందో!

పౌలీనా: ఈ ఫాక్టరీలో మన భాగం తెగనమ్మి పారవెయ్యాలి.

జఖార్: (విసుగుతో) అర్థంలేదు....ఎందుకు అమ్మాలి? అది కాదు విషయం, అన్ని విషయాలు జాగ్రత్తగా, సమగ్రంగా ఆలోచించాలి నేను. నికోలాయ్ వాస్సిలీవిచ్‌తో మాట్లాడుతూండగా, మధ్య ఈవిడ తుపాను

లాగావచ్చి విరుచుకుపడింది.

పౌలీనా: ఆయనకు మనమీద ద్వేషం—ఒట్టి నీచుడు.

జఖార్: (శాంతిస్తో) ఈ విషాద సంఘటనల వల్ల ఆయనకు మతిచెదిరి, కోపోద్రిక్తుడయ్యాడు. కాని చాలా తెలివైనవాడు. మనపై ద్వేషం పెట్టుకునేందుకు యేమీ కారణం లేదు. మెఫేల్ పాపు తర్వాత అనేక కారణాల వల్ల మనతో గట్టిగా పెనవైచుకు పోయాడు.

పౌలీనా: ఆయన అంటేనే నాకు భయం. నిన్ను సులభంగా మోసగిస్తాడు.

జఖార్: పౌలీనా! అవన్నీ తెలివితక్కువ మాటలు! ఆయన గడసరి. సూక్ష్మ బుద్ధి. అసలు యదార్థం యేమిటంటే, కూలీలతో నేను ప్రవర్తించే వైఖరి చాలా అనిశ్చితంగా వుందని అంగీకరించితీరాలి! సాయంకాలం వారితో మాట్లాడినప్పుడు వాళ్లెంత వైరభావంతో వున్నారో గమనించాను, పౌలీనా.

పౌలీనా: నేనా మాటే ముందునుంచీ చెబుతున్నాను. వాళ్లెప్పుడూ మన శత్రువులే! (తాత్యానా నెమ్మదిగా నవ్వుకొని బయటకు వెళ్లిపోతుంది. పౌలీనా ఆమెవైపు చూచి ఆవిడకు వినబడాలనే ఉద్దేశ్యంతో స్వరం హెచ్చించి మాట్లాడుతుంది.) ప్రతివారూ మన శత్రువులే! వారందరికీ మనపై అసూయ! అందుకనే మనపై పగ పూనుతారు.

జఖార్: (వేగంగా పచారుచేస్తో) ఔను, నువ్వు చెప్పింది కొంతవరకూ యదార్థం. వర్గాలమధ్యకాదు వైరుధ్యమూ సంఘర్షణా ఉన్నది, జాతులమధ్య! నల్ల, తెల్ల జాతుల మధ్య వైరం వుంది అంటాడు. ఈమాట మోటుగా వుందనుకో....కొంత అతిశయోక్తి కూడా .... (ఒక్క-క్షణం ఆగి) మనం నాగరికులం; సంస్కృతీపరులం. విజ్ఞానం, కళలు మున్నగునవి మనమే సృష్టించామనే విషయం ఆలోచిస్తే- సమానత్వం, శరీర నిర్మాణం లోని సమానత్వం ...సరే, బాగుంది. అన్నిటికంటె ముందుగా వారినికూడా మానవత్వం కలిగి నాగరికత అలవర్చుకోనీయండి. అప్పుడు మనం సమానత్వాన్ని గురించి మాట్లాడుకోవచ్చును.

పౌలీనా: (హెచ్చరికగా) నీ భావాల్లో కొత్తమార్పు వచ్చినట్లుంది....

జఖార్: ఇంకా బీజప్రాయంగానే వున్నాయి. బాగా ఆలోచించి వాటికి సమగ్రరూపం యివ్వాలి. పరమముఖ్యమైన విషయం ఏమిటంటే మనల్నిమనం అర్థంచేసుకోవడం నేర్చుకోవాలి.

పౌలీనా: (అతనిచేతిని పట్టుకొని) -నీది చాలా జాలిగుండె ప్రియా! అందువల్లనే యీ రభస అంతా చాలా కష్టం కలిగిస్తోంది నీకు.

జఖార్: మనకు తెలిసినది స్వల్పం, అందుచేత అనేక విషయాలు మనకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. ఉదాహరణకు

యీసింజోవ్‌ను తీసుకుందాం. ఆతడు చాలా తెలివి తేటలు గలవాడూ, చక్కటి తార్కికజ్ఞానం కలవాడూ, విశ్వసనీయునివలెనూ నాకు కనిపించాడు. అందుచేత అత డంటే నాకు చాలా నమ్మిక కుదిరింది. అసలు రహస్య మేమంటే, అతడొక సోషలిస్టట. అందువల్లనే అతని భావాల్లో ఆ స్పష్టత, తర్కజ్ఞానమూ కనిపిస్తాయి.

పౌలీనా: ఔను, నిజమే. ఆతడు అందరిదృష్టినీ ఆకర్షిస్తాడు. ఒత్తి అనాకారి. నువ్వు కొద్దిగా విశ్రాంతి తీసుకోవడం మంచిది. పోదామా?

జఖార్: (ఆమెనువెంబడిస్తో) గ్రికోవ్ అని మరొక పనివాడు ఉన్నాడు. ఒత్తి పెంకిఘటం. వినయ విధేయతలు లేవు. నికోలాయ్‌వాస్సిలీవిచ్, నేనూ వాడి ఉపన్యాసం గురించి యింతకుక్రితమే మాట్లాడుకుంటున్నాము. వాణ్ణి చూస్తే యింకా ముక్కుపచ్చలారని కుర్రాడు. వాడి కెంత గర్వం, ఎంత పొగరు! ఎవరి లక్ష్యమూలేదు....

(వారిద్దరూ వెళ్లిపోతారు. నిశ్శబ్దం. రంగస్థలానికి దూరంగా ఒకపాట వినిపిస్తుంది. తరువాత మెల్లగా కంఠస్వరాలు వినిపిస్తాయి. యగోడిన్, లెవ్‌షిన్, రయాబట్‌జోవ్ అనే కుర్రాడూ ప్రవేశిస్తారు. ఆ కుర్రవానిముఖం గుండ్రంగావుండి, మంచిస్వభావాన్ని వెల్లడిస్తూంటుంది. ఆముగ్గురూ చెట్లక్రింద ఆగుతారు)

లెవ్‌షిన్: (నెమ్మదిగాను, రహస్యంగాను) మన శ్రామికవర్గం

కోసం పెష్కోవ్!

రయాబట్‌జోవ్: నాకు తెలుసు....

లెవ్‌షిన్: మన కార్మికవర్గంకోసం, మానవత్వ స్థాపనకోసం. ప్రతి గొప్పవాని తలపైన యీరోజుల్లో మహాగొప్ప బాధ్యత వుంది తమ్ముడూ. ప్రజలందరూ సర్వ శ్రమలకోర్చి, అన్ని విషయాలూ తెలుసుకుంటున్నారు. అన్నీ నేర్చుకుంటున్నారు. చదువుతున్నారు. ఆలోచిస్తున్నారు. ఏ కొద్దో గొప్పో తెలుసుకున్న ప్రతిఒక్కడూ మన వర్గశ్రేయస్సు కొరకు చాలా ఉపయోగిస్తున్నాడు. అట్టివాని విలువ కట్టడం మనతరంకాదు....

యగోడిన్: ఆమాట వాస్తవం, పెష్కోవ్!

లెవ్‌షిన్: వేళాకోళంగాయెంచి యీపనిచేయకూడదు, పెష్కోవ్! ఈ త్యాగం యెందుకొరకు చేస్తున్నావో తెలుసుకుని మరీ చేయాలి. నువ్వింకా కుర్రవాడివి కనుక సైబీరియాలో కారాగారవాస శిక్ష విధిస్తారు.

రయాబట్‌జోవ్: ఐతే మంచిదే. తప్పించుకు పారిపోవచ్చును.

లెవ్‌షిన్: కీడెంచి మేలెంచమన్నారు. సైబీరియావాసం అనుకోవడమే యుక్తం. ఈకఠిన నరకానికి మానసికంగా సిద్ధమైతే, యెంతటి కష్టానికైనా సిద్ధమైనట్లే.

రయాబట్‌జోవ్: నిశ్చయించుకున్నాను, నేనుసిద్ధమే.

యగోడిన్: తొందరపడకు. సాధక బాధకాలు ఆలోచించు....

రయాబట్‌జోవ్: ఇందులో ఆలోచించవలసిన దేముంది? ఆ డైరెక్టరు చంపబడ్డాడు. ఆతని చావుకు, ఎవరో ఒకరు

సమాధానం చెప్పాలి....

లెప్షిన్: అదీ అసలువిషయం. ఎవరో ఒకరు ఆత్మత్యాగం చెయ్యాలి. తానే కాల్చానని, ఎవరో ఒకరు చెప్పక పోతే, చాలామందిని పట్టుకుంటారు. మనవారిలో వజ్రాల్లాంటి మనుష్యులను యేరి పారవేస్తారు, పెష్కోవ్!

రయాబట్ జోవ్: నేను కాదనడంలేదు. నేను కుర్రవాణ్నయినా నా కన్నీ బోధపడతాయి. గొలుసులోని కొక్కెముల వలె, మన మందరమూ ఒకరి నొకరు గట్టిగాపట్టుకుని వుండాలి.

లెప్షిన్: (నిట్టూర్చి) ఆమాటనిజం! ....

యగోడిన్: (నవ్వుతో) మనం ఒకరిచేతు లొకరు పట్టుకొని, వారిని చుట్టుముట్టి, అంతకంతకు వారిని గట్టిగా అదిమి, నొక్కిపారవేస్తాం.

రయాబట్ జోవ్: సరే! నేను నిశ్చయించుకున్నాను. నామీద నెవ్వరూ ఆధారపడిలేరు. అందుచేత నేనేస్వయంగాసిద్ధ మౌతున్నాను. ఆ డైరెక్టరువంటి దుర్మార్గుడికొరకు మన రక్తం ధారపోయవలసివచ్చినందుకే విచారిస్తున్నాను.

లెప్షిన్: ఆదుర్మార్గుడికొరకుకాదు, మన కామ్రేడ్ల పవిత్ర రక్తం కోసం! అమూల్యజీవితంకోసం....

రయాబట్ జోవ్: ఔను, కాని యీడైరెక్టరు వట్టినీచుడు.

లెప్షిన్: వాడునీచుడు కనుకనే చంపివేయబడ్డాడు. మంచివాళ్లకి సహజమైన చావే వస్తుంది. వా రెవ్వరి మార్గానికీ అడ్డురారు.

రయాబట్‌జోవ్: సరే! అంతా నిశ్చయమైనట్లేనా?

యగోడిన్: ఆఁ! నిశ్చయమైనట్లే పెష్కోవ్! అంటే రేపు ఉదయంవెళ్లి నువ్వు చెబుతావన్నమాటేగా?

రయాబటజోవ్: రేపటి వుదయంవరకూ ఆగడం యెందుకు?

లెవ్‌షిన్: రేపటి వుదయంవరకూ ఆగడమే మంచిది. రాత్రి చక్కటిసలహా యిచ్చే చల్లనితల్లి.

రయాబట్‌జోవ్: సరే మీరు చెప్పినట్లే చేద్దాం.... నేనిక వెళ్లనా?

లెవ్‌షిన్: భగవంతుడు నీకు అమోఘమైన సంకల్పబలం కలుగ జేయుగాక!

యగోడిన్: వెళ్లు తమ్ముడూ! ధైర్యంగావుండు!

(రయాబట్‌జోవ్ నెమ్మదిగా వెడతాడు. అతడు తన చేతితో తిప్పుతూన్న కర్రను యగోడిన్ చూస్తూంటాడు. లెవ్‌షిన్ ఆకసంవైపు దృష్టిని నిగుడించాడు)

లెవ్‌షిన్: (నెమ్మదిగా) ఎంతోమంది త్యాగశీలం కల కుర్రవాళ్లు యీరోజుల్లో తయారవుతున్నారు. యగోడిన్!

యగోడిన్: గాలిపాటు సరిగావుంటే పంటలూ బాగానే వుంటాయి.

లెవ్‌షిన్: ఈ యేర్పాటుప్రకారం జరిగిపోతే, యీగొడవనుంచి బయటపడతాం.

యగోడిన్: (చింతతో) పాపం, అనవసరంగా యీకుర్రవాణ్ణి బలి యీయవలసి వచ్చింది.

లెవ్‌షిన్: (శాంతంగా) ఔను. చాలా విచారకరమైన విషయమే. నాకూ చాలా జాలి వేస్తోంది. ఏదో అసహ్యాకరమైన వ్యవహారంలో చిక్కుకుని, ప్రవాసానికి పోవాలి. తన

సోదర కార్మేక్ల రక్షణకొరకు చేశామన్న అంశమే సంతృప్తి నిస్తుంది.

యగోడిన్: ఔను.

లెవ్‌షిన్: ఈవిషయం బయటకు పొక్కనివ్వకూడదు. ఛీ, ఛీ! యాంద్రీ వెళ్లి ట్రిగ్గరు నెందుకు నొక్కాలి? మనిషిని చంపితేమనకు కలిసివచ్చే దేముంది? ఏమీ లాభం లేదు. ఒక కుక్కను చంపితే, యజమాని మరొక కుక్కను కొంటాడు. ఈవిధంగా కథ ముగుస్తుంది.

యగోడిన్: (విచారంతో) మన వాళ్లెంతమంది బలైపోయారు!

లెవ్‌షిన్: రా, కాపలామనిషీ! మనం యజమాని ఆస్తినికాపాడాలి. (వారిద్దరూ వెడతారు) ఓయి ఏసుప్రభూ—

యగోడిన్: ఏమిటయ్యా విశేషం?

లెవ్‌షిన్: ఈజీవితం చాలా ఘోరంగా వుంది. మనం త్వరలోనే యీచిక్కులను పోగొట్ట గలిగితే!

[తెర]

---

# శత్రువులు

## మూడవ అంకం.

(బార్డిన్ గృహంలో విశాలమైన గదివెనుక గోడకు నాలుగు కిటికీ లుంటాయి. తలవాకిటి వసారాలోనికి ఒక ద్వారం వుంది. గాజుఅద్దాల కిటికీగుండా సైనికులు, పోలీసులు, కార్మిక సమూహము, వారిమధ్య లెవ్‌షిన్, గ్రికోవ్‌లూ కనిపిస్తూంటారు. ఆగది నిర్జనంగా వుంటుంది. అందులోవున్న కొద్దిసామాన్లు పాత బడి, అరిగిపోయివున్నాయి. గోడల కంటించిన కాగితం వూడిపోతోంది. కుడిప్రక్కగా ఒక పెద్ద బల్ల వేసివుంది. తెరచేటప్పుడు కాన్ కోపంతో, బల్లవద్ద కుర్చీలు వేస్తూంటాడు. అగ్రఫీనా నేలను పరిశుభ్రం చేస్తోంది. కుడి యెడమ ప్రక్కలనున్న రెండు తలుపులకు ద్వారాలున్నాయి.)

అగ్రఫీనా: బాగుంది వరస! నామీద రుసరుసలాడుతా వెందుకు?

కాన్: నా కెందుకు కోపం? వాళ్ళందరూ కట్టగట్టుకుని గంగలో పడితేమాత్రం నాకేం?....నాచావు దగ్గర కొస్తోంది. అదే నాకు పదివేలు, నాగుండె చాలా బలహీన పడి పోయింది అప్పుడే.

అగ్రఫీనా: కాస్త వెనకా ముందుగా అందరమూ చస్తాం. నువ్వే గొప్పలు చెప్పుకోనక్కరలేదు.

కాన్: నాకు విసుగెత్తిపోతోంది....జీవితం మీద విరక్తి కలి

గింది....అరవై ఐదేళ్లు వచ్చేటప్పటికి గడ్డిపరకను కూడా కొరగాము. పళ్లూడిన బోసి దంతాలతో గట్టి కాయలు కొరికినట్లే వుంటుంది స్థితి!....చూడు, యీ మనుష్యుల నందరినీ పట్టుకొచ్చి యీ బందెలదొడ్లో వర్షంలో నిలబెట్టారు.

(కెప్టెన్ బొబోయ్‌డోవ్, నికోలాయ్‌లు యెడమ ప్రక్క ద్వారంగుండా వస్తారు)

బొబోయ్‌డోవ్: (ఆనందంతో) ఐతే, దీనిని కోర్టు గదికింద యేర్పాటు చేశారన్నమాట! అద్భుతంగావుంది. మీరు అధికారి హోదాలోనే పనిచేస్తున్నా రనుకుంటాము.

నికోలాయ్: ఔను. క్వాష్! కార్పొరల్‌ను పిలుచుకురా.

బొబోయ్‌డోవ్: ఈకోర్టు హాలును యీవిధంగా అమర్చుదాం మధ్యలో వాడి పే రేమిటి?

నికోలాయ్: సింజోవ్.

బొబోయ్‌డోవ్: సింజోవ్! .... పేరు చాలా బాగుంది. వాడి చుట్టూ ఐక్యమైన ప్రపంచ కార్మికు లేమంటారో! ఆ దృశ్యం చూడ ముచ్చటగా వుంటుంది. ఈ యింటి యజమాని బలే సరదాఐన వ్యక్తి. ఆయన మరదలు వారొనెజ్‌లో నాటకాల్లో వేషాలు వేసినప్పుడు చూచాను. అద్భుతమైన నటి! (చావడిలోనుంచి క్వాష్ వస్తాడు)

క్వాష్: అందరి యిళ్లూ సోదా చేశాము దేవరా!

బొబోయ్‌డోవ్: భేష్! ఏమేమి దొరికాయి?

క్వాష్: ఏమీ దొరకలా. పోలీసు యిన్స్పెక్టరు తొందరలో

సోదా సరిగా చేయనేలేదు దేవరా!

బొబోయ్‌డోవ్: అనుకున్నట్టే జరిగింది. ఇందులో కొత్త యేముంది? పోలీసులు ఎప్పుడూ యింతే! ఈ నిర్బంధితులవద్ద యేమైనా దొరికాయా?

క్వాష్: లెవ్‌షిన్ యింట్లో ప్రతిమలచాటున కొద్దిగా దొరికాయి.

బొబోయ్‌డోవ్: నా గదిలోకి తీసుకురా.

క్వాష్: చిత్తం దేవరా! ఆ కొత్త పోలీసుకూడా సోదా సరిగా చేయలా.

బొబోయ్‌డోవ్: సరే! ఆవిషయాలు నువ్వే చూచుకోవాలి. ఇక వెళ్లు. (క్వాష్ సలాం చేసి సెలవు తీసుకుంటాడు.) వీడున్నాడే- యీ క్వాష్ చాలా వింత మనిషి! చూపులకు శుద్ధ దద్దమ్మలాగా కనిపించినా. కూపీ తియ్యడంలో వీడంటటి ఘటికుడులేడు. సరిగా వేటకుక్కవాటం!

నికోలాయ్: నా సలహా పాటించి, ఆ గుమాస్తాపైన ఒక కన్నువేసి వుంచండి.

బొబోయ్‌డోవ్: తప్పక నిఘా వుంచుతాం! చూస్తూవుండండి, వాడి పని పడతాను.

నికోలాయ్: సింజోవ్‌ను గురించికాదు నేను చెబుతూంట! ఆరెండో గుమాస్తా పొలోగీ! మనకు బాగా ఉపయోగిస్తాడు.

బొబోయ్‌డోవ్: ఓహో, వాణ్ణిగురించా మీరు మాట్లాడేది? సరే, బాగుంది! వాణ్ణి కూడా మనలో కలుపుకుందాం.

(నికోలాయ్ బల్లవద్దకు వెళ్లి, జాగ్రత్తగా కొన్ని పత్రాలను సర్దుతాడు)

క్లియోపాత్రా: (కుడి ప్రకనున్న ద్వారం వద్దనుంచి) కెప్టెన్! ఒక కప్పు టీ పుచ్చుకుంటారా?

బొబోయ్‌డోవ్: ఆఁ! పుచ్చుకుంటాను. అనేక అభివందనాలు. మీకు శ్రమ కలిగిస్తున్నాను. చాలా సుందరమైన ప్రదేశమండీ! అంతే కాకుండా, మదాం తాత్యానా గారిని నేను యెరుగున్నాను కూడాను. ఆమె వారోనెజ్ నాటక రంగంలో వేషాలు వేస్తుండేవారు.

క్లియోపాత్రా: అవునట!....సోదాలు చేసినప్పుడు నిషిద్ధ వాఙ్మయం దొరికిందా?

బొబోయ్‌డోవ్: (సౌమ్యంగా) బోలెడంత! కుట్రకు సంబంధించిన యావత్తు భోగట్టా లభ్యమైంది. మీ రేమీ బాధ పడకండి. ఎంత కష్టమైన కేసులోనైనా సరే కూపీలాగి, మేము దోషులను పట్టేస్తాం. ఒక వేళ ఆచోకీ దొరక్కపోతే, అస లేమీ లేకపోయినాసరే, ఏదో ఒకటి కని పెడతాం!

క్లియోపాత్రా: చనిపోయిన నా భర్త యీ కరపత్రాలను లెక్కచేసే వాడు కాదు. "కాయితాలతో విప్లవాలూ రావు, మంత్రాలతో చింతకాయలూ రాలవు" అంటూండేవారు.

బొబోయ్‌డోవ్: ఉహూఁ! ఆమాట పూర్తిగా యదార్థం కాదు.

క్లియోపాత్రా: కరపత్రాలు బుద్ధిహీనులు మూర్ఖుల కిచ్చే ఆజ్ఞా పత్రాలని అంటూండేవా రాయన.

బొబోయ్‌డోవ్: (నవ్వుతో) అది కూడా పూర్తిగా నిజం కాక పోయినా, చాలా తెలివిగానే వుంది యీ మాట.

క్లియోపాత్రా: చూచారా! కరపత్రాలు ప్రకటించడంనుంచి ప్రత్యక్ష చర్యలు జరిపే వరకు వచ్చా రీ కూలీలు.

బొబోయ్‌డోవ్: దోషులను పట్టి, నిర్దాక్షిణ్యంగా దండిస్తాం. ఆ విషయంలో మీరు సందేహించకండి!

క్లియోపాత్రా: మీ మాటలు నా గుండెమంటను చల్లార్చాయి. ఇప్పుడెంతో తృప్తిగా వుంది. మీరు రాగానే నా బాధ లన్నీ తీరిపోయా యనిపించింది.

బొబోయ్‌డోవ్: ప్రజలను సంతోష పరచడమే మా విధి.

క్లియోపాత్రా: మీబోటి ఆరోగ్యవంతులూ, యెల్లప్పుడూ నవ్వుతో సరదాగా వుండే పురుషులను చూడటం నాకెంత హాయిని కలిగిస్తుందో నేను చెప్పలేను. ఈ రోజుల్లో మీ బోటి వారు అపురూప మైపోయారు.

బొబోయ్‌డోవ్: మా పటాలంలోని సైనికులందరూ చిచ్చర పిడుగులంటే నమ్మండి!

క్లియోపాత్రా: మనం టీ తీసుకునేందుకు భోజనాల బల్లవద్దకు పోదాం.

బొబోయ్‌డోవ్: (వెడుతూ) పరమ సంతోషం. మదాం తాత్యానా యీ ఋతువులో యెక్కడ నాటకాలు వేస్తారో చెప్పగలరా, మీరు?

క్లియోపాత్రా: నాకు తెలియదండీ.

(చావడిలోనుంచి తాత్యానా, నాద్యాలు వస్తారు)

నాద్యా: (ఆందోళనతో) ఆ ముసలివాడు– లెవ్‌షిన్ మనవైపు యెట్లా చూచాడో గమనించావా?

తాత్యానా: ఆఁ! చూశాను.

నాద్యా: నా కిదేమీ అర్థం కావడంలేదు....ఇదంతా భయంకరంగా కనిపిస్తోంది. యెందువల్లో....చాలా సిగ్గుగా కూడా వుంది. నికోలాయ్ వాస్సిలీవిచ్! యెందుకీ రభస? ఈ ప్రజ లందరూ యెందుకు నిర్బంధించబడ్డారు?

నికోలాయ్: (పరుషంగా) వారిని నిర్బంధించేందుకు బోలెడన్ని ఆధారా లున్నాయి .... ఈ కేసు ముగిసేవరకూ యీ వావడిలోకి మిమ్మల్ని రావద్దని కోరుతున్నాను.

నాద్యా: సరే! రాములెండి!

తాత్యానా: (నికోలాయ్‌వంక చూస్తో) సింజోవ్‌కూడా నిర్బంధింప బడ్డాడా?

నికోలాయ్: ఆ! సింజోవ్‌కూడా నిర్బంధింప బడ్డాడు.

నాద్యా: (గదిలో తిరుగుతూ) పదిహేడుమంది మనుష్యులు! వాళ్ళ భార్యలు గుమ్మం వెలుపల నిలబడి యేడుస్తున్నారు .... సైనికులు వారిని గెంటివేస్తూ నవ్వుతున్నారు .... కనీసం మర్యాదగా ప్రవర్తించమని చెప్పండి ఆ సైనికులతో.

నికోలాయ్: అది నాకు సంబంధించిన పనికాదు. ఈ సైనికుల పైఅధికారి లెఫ్టినెంటు స్ట్రెపిటోవ్.

నాద్యా: సరే, ఆయన్నే అడిగివస్తాను.

(సడివిక్కుగా వెడుతుంది. తాత్యానా నవ్వి, బల్ల వద్దకు వెళ్తుంది.)

తాత్యానా: నేనాని అస్పష్టుగా వినండి! ఓశాసనాల స్మశానమా!

దయచేసి నామాటలు.....

నికోలాయ్: ఆ సేనాని పెద్ద తెలివిగా మాట్లాడుతున్నా డనుకోను. ఆయన వేశాకోశపు మాటల్ని ఇతర్లుకూడా ఉచ్ఛరించ కూడదు.

తాత్యానా: కాదు, కాదు! నేను చాలా పొరపడ్డాను. 'ఓశాసనాల శవమా' అని ఆయన మీకు పేరుపెట్టారు. అది మీకు నచ్చలేదా?

నికోలాయ్: పరిహాసా లాడే మానసస్థితిలో లే నిప్పుడు నేను.

తాత్యానా: అంటే మీరు గంభీర స్వభావినని చెప్పదలిచారా?

నికోలాయ్: నిన్నటిదినం వీళ్లు మాసోదరుని ఖూనీ చేశారన్న విషయం మీకు జ్ఞప్తికి తెస్తున్నాను.

తాత్యానా: మీ సోదరుడు మరణిస్తే మీకేం?

నికోలాయ్: క్షమించాలి, కాని....

తాత్యానా: (చిరునవ్వుతో) నటించకండి. మీ అన్నకోసం మీ కేమీ విచారం లేదు.... మీ రెవరికొరకూ విచారపడరు. నా మాదిరిగానే మీరును. చావు- అందులోనూ హఠాన్మరణం ఎవరికైనా దిగులు కలిగించేమాట వాస్తవం! కాని, మీ సోదరునికొరకై యదార్థంగా మీరు మానవ హృదయంతో ఒక్క కన్నీటి బొట్టయినా రాల్చారని నేను నమ్మలేను.... అట్టి స్వభావమే మీలో లేదు.

నికోలాయ్: (సహనంతో) మీసంభాషణ చాలా సరదా కలిగిస్తోంది. ....అసలు మీ ఉద్దేశ్య మేమిటో దాపరికం లేకుండా చెప్పండి.

తాత్యానా: మీరూ నేనూ ఒకే రకపు స్వభావం కలవారమని మీ రిప్పటికైనా గుర్తించలేదూ? ఏమంటారు? చాలా విచారకరమైన విషయం. నే నొక నటిని- ఉద్రేకాలకు అతీతమైన చల్లటిరక్తం ప్రవహిస్తోంది నా నరాల్లో. మంచిపాత్ర ధరించి ప్రేక్షకులను రంజింప చేయాలనే వాంఛ ఒక్కటే ప్రబలంగా వుంది నాలో. మీరు కర్కశ హృదయులు! మంచి పాత్ర ధరించేందుకే తాపత్రయపడుతున్నారు. మర్మం విడిచి నాతో నిజం చెప్పండి! మీకు ప్రాసిక్యూటరు ఉద్యోగం చెయ్యాలని వుందా?

నికోలాయ్: (నెమ్మదిగా) ఇక కట్టిపెట్టమని కోరుతున్నాను.

తాత్యానా: (ఒక్కక్షణం ఆగి, తర్వాత నవ్వి) నేను కూట నీతిజ్ఞురాలను కాను. ఒక వుద్దేశ్యంతో మీవద్దకు వచ్చాను.... మీతో ఆహ్లాదంగా, లబ్బుగా మాట్లాడుదామనుకుని వచ్చాను. కాని మీ ముఖారవిందం చూడగానే అవమానించే మాటలు మొదలు పెట్టాను. మీ మనస్సును గాయపరచాలనే కోరికను అణచుకోలేక పోయాను. మీరు కూర్చున్నా, నిలబడినా ఇతరులను గూర్చి తీర్పులు చెబుతున్నా, ఆఖరికి విశ్రాంతి తీసుకుంటున్నా సరే, మిమ్మల్ని బాధించాలనే కోరిక పుడుతుంది. కాని, మిమ్మల్ని ఒక విషయం అడుగుదామని....

నికోలాయ్: (చిరునవ్వునవ్వి) మీరు అడగబోయే దేమిటో నే నూహించగలను.

తాత్యానా: బహుశా, కాని, అప్పుడే ఆలశ్య మైపోయి మీచేతులు దాటిపోయిం దంటారా?

నికోలాయ్: మీ రెప్పు డడిగినా అది మనచేతులు దాటిపోతుంది. సింజోవ్ పూ ర్తిగా కంఠంలోతు వరకూ యిరుక్కుని వున్నాడు.

తాత్యానా: ఈ విషయం యీవిధంగా నాతో చెప్పడం మీకు చాలా సంతృప్తికరంగా వుం దనుకుంటాను.

నికోలాయ్: ఆసంగతి మరుగుపరిస్తే ప్రయోజన మే ముంటుంది?

తాత్యానా: (నిట్టూర్చి) మన యిద్దరికీ ఎంత సన్నిహితమైన పోలిక లునాఏయో యీ ఒక్క సంగతే ఋజువు పరుస్తుంది. నేనూ అందగత్తెను, నీచస్వభావినిని. చెప్పండి- సింజోవ్ యింకా మీ అధీనంలో వున్నాడా?....అంటే అతని స్వాతంత్ర్యం ఇంకా మీచేతుల్లో వుందా?

నికోలాయ్: ఆహా! ఇంకా నాపైనే ఆధారపడివుంది.

తాత్యానా: ఆతణ్ణి వదలిపెట్టమని మిమ్మల్ని కోరుతా ననుకోండి!

నికోలాయ్: ప్రయోజన మేమీ వుండదు.

తాత్యానా: ఆయన్ను వదలివేయమని వేడుకుంటే?

నికోలాయ్: ఫలితం శూన్యం....మీ తంతు చూస్తే నాకు చాలా ఆశ్చర్యం కలుగుతోంది.

తాత్యానా: నిజంగానా?....కారణం?

నికోలాయ్: మీరు గొప్ప రూపసులు! నిస్సందేహంగా స్వయం ప్రతిభ కలవారు. మీ కొక విశిష్ట వ్యక్తిత్వం వుంది. భాగ్య భోగ్యాలతో తులతూగుతూ విలాసంగా కాలం

గడిపేందుకు మీ కెన్నో అవకాశాలున్నాయి .... ఐన ప్పటికీ యీ అనామకునియందు మీకెంతో శ్రద్ధా సక్తులు కలిగాయి, విపరీత ప్రవర్తన ఒక జాడ్యం వంటిది. ఏసంస్కృతిగల వ్యక్తైనా సరే మీ యీవిపరీత ప్రవర్తనకు ఆగ్రహిస్తాడు....స్త్రీల అంద చందాలను సరిగా విలువ కట్టగల ఏ రసికుడైనా యిందుకు మిమ్మ క్షమించలేడు.

తాత్యానా: (వింతగా చూస్తో) ఓహో! అదా మీకు నాపై గల భావం! ఇక సింజోవ్ పైనో?

నికోలాయ్: ఈ రాత్రి ఆ పెద్దమనిషి జైలుకు దయచేస్తాడు.

తాత్యానా: ఇది తిరుగులేని నిర్ణయమేనా, ఏమిటి?

నికోలాయ్: ఔను.

తాత్యానా: ఒక స్త్రీవాంఛను మన్నించుటకొరకైనా, మినహాయిం పులు లేవూ? నాకు నమ్మకంలేదు. నేనుగట్టిగా కోరితే, మీరు తప్పక సింజోవ్‌ను వదులుతారు.

నికోలాయ్: (నెమ్మదిగా) ఐతే, గట్టిగా ప్రయత్నించి చూడండి. ఊ(! ప్రయత్నించండి!

తాత్యానా: నేను చెయ్యలేను....ఏవిధంగా ప్రయత్నించాలో నాకు తెలియదు.....కాని నిజం చెప్పండి- మీ, జీవితంలో ఒక్క పర్యాయం యదార్థం చెబితే నష్టపడిపోరులెండి! అతణ్ణి వదలిపెడతారా?

నికోలాయ్: (ఒక్క ముహూర్త కాలం తటపటాయించి) నాకు తెలియదు.

తాత్యానా: నాకు తెలుసు. (ఒక్క క్షణం ఆగి, నిట్టూర్పుతుంది) మన మిద్దరమూ ఎంత కుళ్లు మనుష్యులం!

నికోలాయ్: కొన్ని విషయాల్లో స్త్రీలను కూడా క్షమించలేం:

తాత్యానా: (నిర్లక్ష్యంగా) దానికేంలెండి! మనిద్దరమే ఒంటరిగా వున్నాం....మన మాటలు యెవ్వరూ వినడంలేదు. తోచిన సంగతి పైకి అనే హక్కుంది నాకు. మీరూ, నేనూ....

నికోలాయ్: మీరు చెప్పే సంగతులు వినదలుచుకోలేదని, ఇంతకు క్రితమే మీకు చెప్పాను.

తాత్యానా: (గంభీరంగా) ఐతే, వెళ్లిపొండి. మీ కాలం వృధా పుచ్చను.

(త్వరగా వెళ్లిపోతాడు శాలువా కప్పుకొని తాత్యానా గది మధ్య నిలబడి వసారావైపు చూస్తుంది. లెఫ్టినెంటు, నాద్యాలు కుడి ప్రక్కనుంచి ప్రవేశిస్తారు.)

లెఫ్టినెంటు: నేను యదార్థం చెబుతున్నాను, నమ్మండి. ఏ సైనికుడూ స్త్రీలను అవమానించడు. స్త్రీలను చాలా పవిత్రంగా యెంచుతాడు.

నాద్యా: సరే, మీరే చూస్తారుగదా.

లెఫ్టినెంటు: అది అసంభవం! సైన్యంలోనే స్త్రీపై గౌరవ ప్రపత్తులు యింకా నిలచి వున్నాయి.

(ఎడమ ప్రక్కనున్న గుమ్మం వద్దకు వెడతారు. పౌలీనా, జఖార్ యాకోవ్‌లు ప్రవేశిస్తారు.)

జఖార్: చూశావా, యాకోవ్!

పౌలీనా: వేరు విధంగా యెట్లా జరుగుతుంది?

జఖార్: మనం యదార్థానికి విరుద్ధంగా పనిచేస్తున్నాం. తప్పని సరిగా జరిగే దానికి ఎదురొడ్డితే ఫలితం యేమిటి?

తాత్యానా: దేనిని గురించి మీ సంభాషణ?

పౌలీనా: ప్రతి వాళ్లా- ఆఖరికి యెప్పుడూ మెత్తగా వుండే యాకోవ్ ఇవానోవిచ్ కూడా మమ్మల్ని నిందిస్తున్నాడు ఈ సైనికులు రావడం మా తప్పు ఐనట్లు! ఆ గూఢచారుల్ని, పోలీసుల్నీ కూడా, ఎవ్వరూ పిలువలేదు. వా రంతట వారే వచ్చారు.

జఖార్: అ నిర్బంధాలకు నన్ను నిందిస్తున్నారు....

యాకోవ్: నేను, నిన్ను నిదించడంలేదు.

జఖార్: మాటల్లో అంటున్నావని కాదు, కాని నాకు బోధపడుతూనే వుంది.

యాకోవ్: (తాత్యానాతో) నే నక్కడ కూర్చున్నాను. ఈయన వచ్చి "బాగుందా తమ్ముడూ?" అన్నాడు. "కుళ్లిపోయింది అన్నా!" అని నేను సమాధానం యిచ్చాను.

జఖార్: సోషలిజం యిచ్చట ప్రచారం చేయబడే రూపంలో ఇతర దేశాల్లో దుస్సాధ్యమని మీరు గుర్తించ లేదూ? అది అసంభవం, అంటే నమ్మండి.

పౌలీనా: ప్రతి వారూ రాజకీయాల్లో ఆసక్తి కనపరచాలి. కాని, రాజకీయాలకూ సోషలిజానికీ సంబంధం యేమిటి? అని జఖార్ అడుగు తున్నాడు. ఆయన చెప్పేది వాస్తవమే!

యాకోవ్: (చిరాకుతో) ఒవ్‌షిన్ అనే ఆ ముసలివాడు యే రక మైన సోషలిస్టు? పని జాస్తీ అయి, పూర్తిగా శోషిల్లి పైత్యాధిక్యంలో ఏదో నోటికి వచ్చిందల్లా పేలు తుంటాడు.

జఖార్: పైత్య మెక్కువై వాళ్లందరూ తెలివి తప్పిన స్థితిలోనే వున్నారు.

పౌలీనా: మీకు జాలి వుండాలి. మే మెంత బాధ పడుతున్నామో కొంచం సానుభూతితో ఆలోచించాలి.

జఖార్: నా గృహాన్ని న్యాయస్థానం క్రింద మార్చివేస్తే నాకు లోపల బాధగా లే దనుకుంటున్నారు కాబోలు మీరు. ఇదంతా నికోలాయ్ వాస్సిలీవిచ్ చేసిన పొరపాటు. ఇంత నాటకం జరిగాక ఆతనితో వాదించడం బాగుండ దని ఊరుకున్నాను.

క్లియోపాత్రా: (వేగంగా వచ్చి) తెలిసిందా మీకు? హంతకుడు పట్టు బడ్డాడు.... వాడిని యిక్కడకు తీసికొని వస్తు న్నారు.

తాత్యానా: ఎవరు?

క్లియోపాత్రా: ఒక కుర్రవాడు.... నాకు చాలా సంతోషంగా వుంది. ....బహుశా యిది అమానుషంగా కనపడవచ్చు కాని, నిజంగా నాకు పట్టరానంత ఆనందం కలిగింది. వాడు మరీ చిన్నవాడైతే, ప్రతి రోజూ విచారణ ముగిసే వరకూ, తోలు వూడేటట్లు కొరడా దెబ్బలు కొట్టించి వుందును. నికోలాయ్ వాస్సిలీవిచ్ యెక్కడున్నాడు?

....మీరు చూశారా? (ఎడమ ప్రక్క నున్న తలుపు దగ్గరకు వెడుతుంది. అక్కడ సేనాని యెదురు పడ తాడు)

సేనాని: పరమ అసహ్యం! ఈ సైనికులు మరికొన్ని దినాలు యిక్కడవుంటే! వాడు పక్కమీద పడుకున్నప్పుడు బకెట్లతో చన్నీళ్ల గుమ్మరించి వుందును. నాపటాలంలో పిరికివాళ్లని, జాలిగుండె వాళ్లని, యీవిధంగానే చేసి, పిరికిదనం కాస్తా వదల కొట్టించేవాణ్ణి! తడిసి ముద్దై, చలితో వణుకుతూ, కుయ్యో మొర్రో మంటూ గంతు లేస్తుంటే, చూచేందుకు మహా తమాషాగా వుంటుంది.

క్లియోపాత్రా: (ద్వారంవద్ద నిలబడి) మీ రిట్టి మాట లెందు కంటారో తెలియకుండా వుంది. ఆ కెప్టెన్ చాలా మర్యాదస్తుడూ, శక్తి-సామర్థ్యాలుకలవాడూను. వచ్చిన వెంటనే దోషుల నందరినీ పట్టివేశాడు. ఆపనిని మనం మెచ్చుకోవాలి.

సేనాని: ఊహూం! బుంగమీసాలు పెంచిన వా డెవడైనా సరే, యీవిడ దృష్టిలో గౌరవనీయుడే! తమ అంతరువు, స్థానం తెలుసుకొని మనుష్యులు మసలు కోవాలి. అదీ అసలు సంగతి. అదీ మర్యాదస్తుల లక్షణం! (ఎడమ ద్వారం వద్దకు వెడతాడు) ఏయ్, కాన్!

పౌలీనా: (నెమ్మదిగా) ఈ చుట్టుప్రక్కల కంతకూ యీవిడే మహారాజ్ఞి వలె వేషాలు వేస్తోంది, చూడండి! ఎంత అసభ్యంగాను, మోటుగాను సంచరిస్తోందో!

జఖార్: త్వరగా యీగొడవ ముగించి వేస్తే, యెంత బాగుం డును? ఏగొడవా లేకుండా శాంతంగా వుంటే, యెంతో సుఖంగా వుండును.

నాద్యా: (లోనికి పరుగెత్తుకొని వచ్చి) టాన్యా పిన్నీ! ఆ లెప్టి నెంటు ఒట్టి బుద్ధిహీనుడమ్మా! ఆ సిపాయిలను కొడు తూంటా డనుకుంటాను .... అబ్బబ్బ! వారి మీద యెట్లా అరుస్తుంటా డనుకున్నావ్! వారిని తిట్టే టప్పుడు ఆతని ముఖ భంగిమలు చూడవలసిందే కాని చెప్పేందుకు తీరదు. ఆ నిర్బంధితులకు వారి పెళ్లాం బిడ్డలను చూచేందుకు అనుజ్ఞ యిప్పించ వలసింది బాబాయ్! వారిలో ఐదుగురకు వివాహమైంది .... ఆ పోలీసుతోచెప్పి వద్దూ — ఇప్పుడు కాపలావున్న పోలీసుతో.

జఖార్: కాని, చూడు నాద్యా!....

నాద్యా: నువ్వు కదిలేయెత్తు కనపడటంలేదు....లే, వెళ్లి చెప్పు ....వాళ్లు యేడుస్తున్నారు .... నామాట విని వెళ్లిరా.

జఖార్: (వెడుతో) నేను వెళ్లడం వల్ల ప్రయోజన ముండ దనుకుంటాను.

పౌలీనా: నువ్వు అస్తమ్మానమూ, అందరినీ కష్టపెడుతున్నావు నాద్యా, చిన్నతనం చేష్టలు!

నాద్యా: ఇతరులను కష్టపెట్టేది మీరే, నేను కాదు!

పౌలీనా: మేమా? ఆలోచించి చూడు!

నాద్యా: (ఆందోళనతో) మన మందరమూ....నువ్వూ, నేనూ!

బాబాయీ - మనమూ ప్రజలను బాధించే వాళ్లం! మనం స్వయంగా చెయ్యం! కాని, పోలీసులు, గూఢచారులు, సైనికులు వస్తారు, అమాయకులను నిర్దోషులను నిర్బంధిస్తారు! ఆపైని ఆలగోల, బాలగోల! ఆ నిర్బంధితుల పెళ్లాం బిడ్డల గోల చూడండి .... దీనికంతా మనమే కారకులం.

తాత్యానా: ఇట్లారా, నాద్యా.

నాద్యా: (ఆమె వద్దకు వెళ్లి) సరే, వచ్చాను .... ఏమి పని వుంది?

తాత్యానా: మార్చుని, శాంతించు ... సరే నీకు అర్థమూకాదు, నువ్వు చెయ్యగలిగిందీ లేదు.

పౌలీనా: నువ్వు చాలా పెంకిపిల్ల వని మీ అమ్మ చెప్పినమాట ముమ్మాటికీ నిజం!

నాద్యా: ఔను. ఆమె చెప్పినమాట యదార్థమే! ....ఆమె తినే తిండిని కష్టించి సంపాదించుకునేది....కాని, నువ్వో? నువ్వేమి చేస్తున్నావ్?.... ఎవరి తిండి తింటున్నావ్?

పౌలీనా: అదుగోనమ్మా! దీనికి మళ్లీ మతి చెడింది. నీమాటల ధోరణి మార్చుకోవాలి, నాద్యా! పెద్దలని నోటికి వచ్చిన మాట లనవచ్చునా?

నాద్యా: మీరు నాకు పెద్దలుకారు. ఆహాహా! ఎటువంటి పెద్ద లండీ మీరు? మీకు వయస్సు ముదిరిం దంతే!

పౌలీనా: టాన్యా! ఇదంతా నీ బోధనల ప్రభావం. అది వట్టి బుద్ధి తక్కువ పిల్ల అని యీ నాద్యాకు గట్టిగా నచ్చ

చెప్పవలసింది.

తాత్యానా: విన్నావా నాద్యా! నువ్వొక బుద్ధిహీనురాలివి ....
(ఆమె వీపుమీద తట్టుతుంది)

నాద్యా: సమాధానం చెప్పేందుకు ఏమీ తోచకపోతే తిట్లు తిట్టడం ప్రారంభిస్తారు మీబోటి పెద్దలు. మీ చర్యలను సమర్థించుకునేందుకు కూడా, మీకేమీ సాకు దొరక డంలేదు. మీ రెందుకూ పనికిరారు! మీ స్వంత యింట్లో కూడా మీ పెత్తనం సాగదు. ఎందుకూ కొరగాని వాళ్లు.

పౌలీనా: (కఠినంగా) ఏమిటీ అ ఒడలు తెలియని వాగుడు? పేట్రేగి పోతున్నావు.

నాద్యా: ఈసైనికులు, గూఢచారులు, పోలీసులు, ఒక్కొక్కడు అడుగు పొడుగు మీసాలు పెంచారు. బడుద్దాయిలు. వీళ్లు చేస్తోన్న పనేముంది? టీ త్రాగడం. అధికారం చెలాయించడం, కత్తులు ఝుళిపించడం, బూట్లు వేసు కొని భూమి అదరునట్లు టక్ టక్ మని నడవడం, కేరింతాలు కొడుతో, బొమ్మలు విరుచుకుంటో నడవడం, .... ప్రజల్ని పట్టుకొని దబాయించడం, భయపెట్టడం, ఆడవాళ్లని యేడిపించడం, ఇంతే కదా వాళ్లు చేస్తూన్నపని.... ఇక మీసంగతో.... మీయింట్లోనే మిమ్మల్ని ఒక మూలకు నెట్టి పారవేశారు....

పౌలీనా: శుద్ధ తెలివి తక్కువగా వాగుతున్నావు, ఒడలు తెలి యడంలేదూనీకు? వీళ్లు మనను రక్షించేందుకువచ్చారు.

నాద్యా: (విరసంగా) ఓసి పౌలీనా పిన్నమ్మా! తెలివితక్కువ తనాన్నుంచి ఈ పోలీసులు కూడా ఎవ్వరినీ రక్షించ లేరమ్మా!

పౌలీనా: (కోపంతో) ఏమిటీ?

నాద్యా: (చేతులుచాచి) కోప్పడకు! అందరిని గూర్చి అన్న మాట, అది! (పౌలీనా విసురుగా బయటకు వెళ్లి పోతుంది) అమ్మయ్య! ఈ విడ వసుగెత్తి కెళ్లి పోయింది. చిన్నా పెద్దా తారతమ్యం చూపకుండా మోటుగా మాట్లాడానని, బాబాయితో చెబుతుంది. ఆపైన ఆయన పెద్ద ఉపన్యాసం దంచుతాడు. ఆఖరికి యీగల చెవులుకూడా ఘళ్లుమని పగిలి, పడిచస్తాయి.

తాత్యానా: (ఆలోచనా పూర్వకంగా) అమాయకురాలా! ఈప్రపంచకంలో ఎట్లా బ్రతుకుతావో అర్థం కావడం లేదమ్మా!

నాద్యా: (చేతులూపి) ఈ విధంగా మాత్రం కాదమ్మా! ధనరాసులు వచ్చి ఒడిలో పడినా, యీరకం జీవితం వద్దు, తల్లీ! నే నేంచేస్తానో నా కిప్పుడు అర్థం కావడంలేదు....కాని, మీరుచేస్తోన్న పను లేమి నేను చెయ్యను. ఇంతక్రితం ఆ అధికారితో వసారాలో వెడుతూంటే, గ్రికోవ్ సిగరెట్టు కాలుస్తో నావంక చూశాడు. ఆతడి కళ్లు నవ్వుతున్నాయి. ఒక మూల తనను ఖైదుకు పంపిస్తున్నారని తెలిసి వుండికూడా నిర్భయంగా నవ్వుతున్నాడు. ఎవరైతే హృదయపూర్వ

కంగా తాము వాంఛించిన విధంగా జీవితాన్ని గడుపు
తారో వారిని యెట్టి ఘోర విపత్తుయా కర్తవ్యపథం
నుంచి సంచలింపనీయవు. వా ళ్లెప్పుడూ నవ్వుతో
అగ్నిలో దూకేందుక్కూడా సిద్ధంగా వుంటారు.
లెవ్‌షిన్, గ్రికోవ్‌ల వైపు చూచేందుకే సిగ్గుపడి
పోతున్నాను....తక్కిన వారిని నేను యెరుగను కాని,
ఆ యిద్దరినీ మాత్రం .... నాజీవితంలో యెన్నడూ
మరచి పోలేను. ఆ మీసాలరాయుడు యిట్లా వస్తు
న్నాడు....అబ్బబ్బ....

బొబోయ్‌డోవ్: (ప్రవేశించి) ఏమిటీ ఆర్భాటం! ఎవరిని భయ
పెడదామని ప్రయత్నిస్తున్నావు నువ్వు?

నాద్యా: నిన్ను చూస్తేనే నాకు భయంగా వుంది .... ఆ ఆడ
వారిని తమభర్తలను చూడనిస్తావా?

బొబోయ్‌డోవ్: వెళ్లనిస్తాను....నేను భయంకర నరపిశాచిని?

నాద్యా: ఒకసారి సైన్యంలో జేరితే, స్వభావమే మారిపోతుంది.
ఆ స్త్రీలను యెందుచేత భర్తలను చూడనివ్వరూ?

బొబోయ్‌డోవ్: (మర్యాదగా) ప్రస్తుతానికి సాధ్యపడదు. తర్వాత
ఆ మగవాళ్లని ఖైదుకు పంపేటప్పుడు వారిని మాట్లాడ
నిస్తాను. అప్పుడు శెలవు తీసికొనవచ్చును.

నాద్యా. ఏం? ఎందుచేత సాధ్యపడదు? అది అంతా నీపైనే
ఆధారపడి వుంది. నువ్వు తలుచుకుంటే చెయ్యగలవు.
ఔనా, కాదా?

బొబోయ్‌డోవ్: నామీదా? .... అంటే క్రిమినల్ ప్రాసీజరు

చట్టాల పెన.

నాద్యా: ఆ చట్టాలకీ దీనికీ సంబంధ మేమిటీ? నిన్ను వేడు కుంటాను గాని, వారిని కలుసుకోనిద్దూ. పుణ్యముం టుంది.

బొబోయ్‌డోవ్: ఏమిటి నీ ఉద్దేశ్యం? దీనికీ న్యాయశాస్త్రానికీ సంబంధం లేదూ? నువ్వు కూడా న్యాయ చట్టాలను ధిక్కరిస్తున్నావా? తప్పు! తప్పు!

నాద్యా: ఏమిటయ్యా! నాతో ఆ మాటలు కట్టిపెట్టు! నేను పసి పిల్లను కాను.

బొబోయ్‌డోవ్: నాకు నమ్మకంలేదు. తప్పూ ఒప్పూ యెరుగని చిన్నపిల్లలూ, విప్లవకారులూ మాత్రమే న్యాయచట్టా లను ధిక్కరిస్తారు.

నాద్యా: అట్లయితే నేను విప్లవవాదినే!

బొబోయ్‌డోవ్: (నవ్వుతో) ఐతే, నిన్ను జెయిలులో పెట్టవలసిన పని నా దన్నమాట! చేతులకు సంకెళ్లు వేసి, ఖైదులో పడవేసి, పోలీసు కాపలాలో వుంచుతాను, చూచుకో.

నాద్యా: (విచారంతో) అబ్బబ్బ! వేళాకోళాలు కట్టిపెట్టి, వారిని చూడనీయవయ్యా!

బొబోయ్‌డోవ్: అనుజ్ఞ యిచ్చేందుకు వీలులేదు, న్యాయ చట్టం ఒప్పదు!

నాద్యా: పిచ్చి చట్టం.

బొబోయ్‌డోవ్: (తీవ్రంగా) ఊహూం!.... ఆమాట అనకూడదు. నువ్వు అంటున్నట్లు నువ్వు చిన్నపిల్లవు కాకపోతే,

అధికారంలో వున్నవారు యీ చట్టాల్ని చేశారనీ, ఈ చట్టాలే లేకపోతే, ప్రభుత్వమే నడవదనీ, యీపాటికి గ్రహించే వుందువు.

నాద్యా: (కోపంతో) చట్టాలు! అధికారం!! ప్రభుత్వం!!! ఐతే, ఒక్క మాట అడుగుతాను చెప్పు. ఇవన్నీ ప్రజాక్షేమం కొరకు కాదూ ఏర్పడింది?

బొబోయేడోవ్: ఔను, నిజమే! అంటే అన్నిటికంటె ముందుగా శాంతిని కాపాడేందుకు.

నాద్యా: ప్రజలను యేడ్పించే చట్టాలవల్ల ప్రయోజనం శూన్యం. శుద్ధ అక్రమ చట్టాలు! నీప్రభుత్వమూ, శాసనాలూ, ప్రజలను గోలయెత్తిస్తే అవ్వి మాకువద్దు. ప్రభుత్వం! ....ఎంత తెలివిమాలినది!....దానితో నా కేమీ అక్కర లేదు.....(తలుపు దగ్గరకు వెడుతుంది.) ప్రభుత్వం! తమకు అర్థంకాని విషయాలపై యీ ప్రజ లెందుకు వాగుతారో నాకు బోధపడటం లేదు!

బొబోయేడోవ్: తాత్యానా! ఈమె చాలా అసాధ్యపు పిల్ల! ఈమె ఆలోచనలు అపాయకరమైన మార్గాల్లోకి వెడుతున్నాయి .... ఆమె పినతండ్రి ఉదారవాది అని విన్నాను. ఆమాట నిజమేనా?

తాత్యానా: నాకంటె మీకే బాగా తెలిసివుండాలి. ఉదారభావాలేవో నాకు తెలియదు.

బొబోయేడోవ్: ఏమిటండీ మీఉద్దేశ్యం? ఈ విషయాలు అందరూ యెరుగుదురు. పదవులో ఉన్నవారిని ధిక్కరించడమే

ఉదారవాద మంటేను!.... ఈ విషయాల కేమిగాని, మీరు వారొనెక్కో నాటకం వేసినప్పుడు చూశాను. శ్రీమతి తాత్యానా! మీ అసాధారణ నటనాకౌశల్యాన్ని చూచి ముగ్ధుణ్నయి పోయాను. మీరు కూడా నన్ను చూచే వుంటా రనుకుంటాను. వైస్ గవర్నరుగారి ప్రక్కనే కూర్చునేవాణ్ని. ఆరోజుల్లో నేను స్థానిక ప్రభుత్వ ప్రసానోద్యోగిగా పనిచేసేవాణ్ణి.

తాత్యానా: నాకు గుర్తులేదు....బహుశా వచ్చి వుంటారులెండి!.... ప్రతి పెద్ద పట్టణంలోనూ సైనికులు ఉంటా రను కుంటాను.

బొబోయెడోవ్: ఆఁ! ఉంటారండీ! ప్రతిపట్టణంలోనూ, మినహాయింపు లేకుండా సైనికు లుంటారు. మాఉద్యోగులమే యదార్థమైన కళాభిమానుల మంటే నమ్మండి! వర్తకులు కూడా కళాపోషకులే ననుకోండి! ఏదైనా సంస్థకు విరాళాల కొరకు ఏ అభిమాన నటియైనా ప్రదర్శనమిస్తే, అత్యధికంగా విరాళా లిచ్చేది మేమే కదా! నయాన్ని భయాన్ని ప్రజలకు ఖరీదుగల టిక్కెట్లు అంటగట్టి, డబ్బు గుంజేది కూడా మేమే! చందాల జాబితాలలోనూ మా ఉద్యోగస్థులవే పెద్ద పద్దులు. ఇది మాలో ఒక సాంప్రదాయ మైపోయింది. ఈ వచ్చే ఋతువులో మీ రెక్కడ ప్రదర్శనా లిస్తారు?

తాత్యానా: ఇంతవరకూ నిశ్చయించుకోలేదు. తప్పకుండా నిజమైన కళాభిమాను లే పట్టణంలో ఎక్కువగా వుంటారో,

అక్కడే ప్రదర్శిస్తాం. అది తప్పనిసరికదా!

బొబోయ్‌డోవ్: (గ్రహించక) ఔను, మీ రన్నమాట నిజమేనండీ! ప్రతి పట్టణంలోనూ అట్టివా రుంటారు. అంత కంతకు ప్రజలు సంస్కృతీ పరు లౌతున్నారు.

క్వాష్ (వసారాలోనుండి) దేవరా! ఆ తుపాకీ కాల్చినవాణ్ణి పట్టుకొని తీసుకొస్తున్నారు ఎక్కడ హాజరు పెట్ట మంటారు?

బొబోయ్‌డోవ్: ఇక్కడ!.... అందరినీ ఇక్కడికే తీసికొని రండి! ప్రాసిక్యూటరుగారిని పిలవండి (తాత్యానాతో) క్షమిం చండి. కొద్దిసేపు పని చూచుకోవాలి.

తాత్యానా! ఆ నిర్బంధితుల నిప్పుడు పరీక్షిస్తారా?

బొబోయ్‌డోవ్: (మర్యాదగా) కొద్దిగా, ఏదో పైపైని- వారి పరి చయం చేసుకునేందుకు మాత్రమే ....ఒక రకమైన హాజరు పిలుపులాగా.

తాత్యానా: నేనుకూడా వుండవచ్చునా?

బొబోయ్‌డోవ్: ఊఁ! సామాన్యంగా, ఎవ్వరినీ ఉండనివ్వరు. రాజకీయ కేసుల్లో అసలే యీ ఆచారంలేదు. ఇది హత్యానేరానికి సంబంధించినది కనుక, ఇది సరియైన కోర్టు కాదుకనుక, మీ సరదా తీర్చేందుకు అనుమ తిస్తాను.

తాత్యానా: నే నెవ్వరికీ కనపడనులెండి! .... ఇక్కడనుంచి చూస్తూంటాను.

బొబోయ్‌డోవ్: బాగుంది! మీ నటన నాకు కలిగించిన ఆనందానికి,

ప్రత్యుపకారం చేయగలిగినందుకు, నాకు చాలా సంతోషంగా వుంది. కేసుకు సంబంధించిన కాగితాలు తీసుకు రావాలి. వెళ్ళి వస్తాను. (బయటకు వెడతాడు. రయాబట్‌జోవ్ జబ్బలు పట్టుకొని ఇద్దరు మధ్య వయస్కులైన కార్మికులు తీసికొని వస్తారు. ఆతని ప్రక్క కాన్ నడుస్తో, ఆ ఖైదీ ముఖం చూస్తుంటాడు. వారి వెనుక లెవ్‌షిన్, గ్రికోవ్, యగోడిన్, ఇంకా కొందరు కార్మికులు వస్తారు. సైనికులు హెచ్చరికతో వుంటారు.)

రయాబట్‌జోవ్: (కోపంతో) నా చేతులెందుకు కట్టేశారు? విప్పి వెయ్యండి ఊఁ! విప్పరేం.

లెవ్‌షిన్: ఏయ్ మనుష్యులూ! ఆకుర్రవాడి చేతికట్లు విప్పండి. ....ఎందు కాతనికి కష్టం కలిగించడం?

యగోడిన్: వాడు పారిపోడులెండి.

రయాబట్‌జోవ్: ఈకట్లు ఎందుకు? విప్పివెయ్యండి.

కాన్: (అకస్మాత్తుగా) మీరు పొరబడ్డారు. వేరొకణ్ణి పట్టుకున్నారు.... ఆ కాల్పులు జరిగినప్పుడు వీడు నదిమీద వున్నాడు, నేనూ, సేనానీకూడా చూశాం. (రయాబట్‌జోవ్‌తో) చెప్పరా, బుద్ధిమాలినవాడా! నువ్వు కాదని చెప్పకోరా. నోరుమూసుకొని నిలబడ్డావేంరా? ....

రయాబట్‌జోవ్: (ధృఢస్వరంతో) నేనే చంపాను.

కాన్: [బిగ్గరగా అరుస్తో] నువ్వు అబద్ధమాడుతున్నావ్. అల్లరి పిల్లాడా! బొబోయెడోవ్, నికోలాయ్‌లు ప్రవే

శిస్తారు.] ఆ గలాటా జరిగిన సమయంలో నువ్వు పడవ నడుపుతో పాట పాడుతున్నావ్.... ఈమాట కాదనగలవా?

రయాబట్‌జోవ్: [శాంతంగా] ఆ పని ఐనతర్వాత.

బొబోయ్‌డోవ్: హంతకుడు వీడేనా?

క్వాష్: చిత్తం, దేవరా!

కాన్: వాడు కాదు.

బొబోయ్‌డోవ్: ఏమిటి క్వాష్! యీ ముసలివాణ్ణి అవతలికి తీసికొనిపో. వీడు లోపలికెందు కొచ్చాడు?

క్వాష్: వీడు సేనానివద్ద పనిచేస్తున్నాడు దేవరా! [రయాబట్‌జోవ్‌ను పరీక్షగా చూస్తో] ఒక నిమిషం ఆగండి....వీడిని వదలి వెయ్యి క్వాష్!

కాన్: మీద చెయ్యివేస్తే జాగ్రత్త. నేనూ సైనికుణ్ణే.

బొబోయ్‌డోవ్: చాలు, క్వాష్.

నికోలాయ్: [రయాబట్‌జోవ్‌తో] మా అన్నగారిని చంపినది నువ్వేనా?

రయాబట్‌జోవ్: ఔను, నేనే.

నికోలాయ్: ఎందుకు చంపావు?

రయాబట్‌జోవ్: మమ్మల్ని చాలా బాధించేవాడు.

నికోలాయ్: నీ పేరేమిటి?

రయాబట్‌జోవ్: పావెల్ రయాబట్‌జోవ్.

నికోలాయ్: ఊహూఁ. నువ్వు చెప్పే దేమిటి, కాన్?

కాన్: [గాభరాపడుతో] వాడు చంపలేదు. ఆ కాల్పులు జరిగి

నప్పుడు వీడు నదిమీద పడవలో వున్నాడు .... నేను ప్రమాణంచేసి చెబుతున్నాను. నేనూ సేనానీ చూశాం ...."వీడి పడవ తంత్రిందులు చేసి, వీడిని నీటిలో ముంచితే, బలే తమాషాగా వుండదూ?" అన్నాడు సేనాని. ఓరి అవకతవక కుంకా! విన్నావురా యీ సంగతి? ఎందుకు అబద్ధా లాడుతున్నావురా?

నికోలాయ్: హత్య జరిగినప్పుడు వీడు పడపమీదే ఉన్నాడని, యే కారణంవల్ల యింత ధృఢంగా చెబుతున్నావు కాన్?

కాన్: వాడు వున్న చోటునుంచి. యీ ఫాక్టరీకి పూర్తిగా ఒక గంట నడక వుంటుంది.

రయాబట్జోవ్: నేను పరుగెత్తుకొచ్చాను.

కాన్: వీడు పడవ నడుపుతూ పాడుతున్నాడు. మనిషిని చంపిన వెంటనే పాటలు పాడగలరా?

నికోలాయ్: [రయాబట్జోవ్తో] తప్పుడు సాక్ష్యమిచ్చి ఏ నేరస్థుణ్ణైనా, కాపాడేందుకు ప్రయత్నిస్తే, చాలా కఠిన శిక్ష పడుతుందని గుర్తించావా? — నీకు తెలుసునా?

రయాబట్జోవ్: నిజం చెప్పేటప్పుడు నాకేమి భయమండీ.

నికోలాయ్: సరే, బాగుంది. ఐతే డైరెక్టరును చంపినది నువ్వే నంటావా?

బొబోయెడోవ్: ఓరి మూర్ఖుడా.

కాన్: అబద్ధమాడుతున్నాడు.

లెవ్షిన్: ఏయ్ సైనికుడా! నీ కేం సబంధముందయ్యా? మధ్య

నీగోల హెచ్చుగావుంది.

నికోలాయ్: ఏమిటది?

లెవ్షిన్: తనకు సంబంధం లేనివాంట్లో, యీ సైనికుడు పానకంలో పుడకలాగు అడ్డు తగులుతున్నాడెందుకు?

నికోలాయ్: నీకే మహా సంబంధ ముంది కాబోలు! బహుశా యీ హత్యానేరంతో నీకు కూడా సంబంధ ముందా?

లెవ్షిన్: (నవ్వి) నాకా? ఒకసారి కర్రతో ఒక సీమకుందేలును చంపాను. అటుతర్వాత పదిరోజులవరకూ భయంతో సరిగా నిద్రే పట్టలేదు.

నికోలాయ్: ఐతే నువ్వు నోరుమూసికొని పడివుండు. (రయాబట్జోవ్‌తో) నువ్వు ఉపయోగించిన రివాల్వరేదీ?

రయాబట్జోవ్: నాకు తెలియదు.

నికోలాయ్: ఏరకం? వర్ణించు.

రయాబట్జోవ్: (నసుగుతూ) రకమా?....మామూలుదే.

కాన్: (సంతోషంతో) ఓరి మూర్ఖుడా! వీడు రివాల్వరును చూడనైనా లేదు.

నికోలాయ్: ఎంత పొడు గుంటుంది? (మూరచూపిస్తో) ఇంత పొడు గుంటుందా?

రయాబట్జోవ్: ఆఁ!....కాదు, కాదు, అంతకంటె చిన్నదే.

నికోలాయ్: బొబోయ్‌డోవ్! ఒకమాట. (బొబోయ్‌డోవ్‌ను ఒక ప్రక్కకు తీసికొని వెళ్లి, గొంతుక తగ్గించి) వీ దేదో తంతు నడుపుతున్నాడు. ఈ కుర్రవాడిపని గట్టిగా పట్టాలి మనం. న్యాయమూర్తి వచ్చేవరకూ వీడిని

వేరే వుంచుదాం.

బొబోయ్‌డోవ్: కాని, ఎందుకండీ, వీడిని వేరే వుంచటం? వాడే నేరాన్ని స్వయంగా ఒప్పుకుంటున్నాడు కదా!

నికోలాయ్: (నొక్కి–చెబుతో) వీడు అసలు హంతకుడు కాదనీ, ఎవణ్ణో దాచేందుకు అబద్ధ మాడుతున్నాడనీ. నీకూ నాకూ కూడా అనుమానంగానే వుంది, తెలిసిందా?

(బాగా త్రాగి మత్తెక్కిన యాకోవ్ తాత్యానా నిలబడిన తలుపు వద్దనుంచి వచ్చి నిశ్శబ్దంగా చూస్తూంటాడు. అప్పు డప్పుడు తలవాల్చి కునుకు పాట్లు పడుతో మరల మరల భయపడినట్లు తలయెత్తి బిత్తరి చూపులు చూస్తూంటాడు.

బొబోయ్‌డోవ్: ఓహో! జానాను! చూడండి! యెంతగమ్మత్తో!

నికోలాయ్: ఇదంతా కల్పితం. సమిష్టినేరం.

బొబోయ్‌డోవ్: అమ్మ, తుంటరివెధవ!

నికోలాయ్: వీడిని తీసికొనిపోయి విడిగా వుంచి, ఎవ్వరూ మాట్లాడకుండా కాపలా కాయమని, కార్పొరల్‌తో చెప్పండి. నే నొక క్షణం పనిమీద బయటకు వెళ్లి వస్తాను. ఇట్లారా కాన్! నేనాని యెక్కడున్నాడు?

కాన్: వాన పాములను పడుతున్నారు.

(ఇద్దరూ వెడతారు)

బొబోయ్‌డోవ్: క్వాష్! వీణ్ణి బయటకు తీసికొనిపోయి, జాగ్రత్తగా కాపలాకాయి. ఒకకన్ను వేసివుంచు, భద్రం!

క్వాష్: చిత్తం దేవరా! రారా కుర్రాడా!

లెవ్‌షిన్: (ప్రేమతో) శెలవ్ పెషోక్! శెలవు మిత్రమా!
యగోడిన్: (విచారంగా) శెలవు పెషోక్!....
రయాబట్‌జోవ్: శెలవ్....అంతా బాగానేవుంది.
బొబోయ్‌డోవ్: వాడిని యెరుగుదువా ముసిలాడా?
లెవ్‌షిన్: ఆహాఁ! ఎరుగుదును. మే మంతా కలసి పని చేస్తూటాం.
బొబోయ్‌డోవ్: నీ పేరేమిటి?
లెవ్‌షిన్: ఎఫిమ్ ఎఫిమోవ్ లెవ్‌షిన్.
బొబోయ్‌డోవ్: (తాత్యానాతో నెమ్మదిగా) ఇకమీదట జరిగే విషయాలను జాగ్రత్తగా గమనిస్తూండండి. నిజం చెప్పు లెవ్‌షిన్! నువ్వు వయోవృద్ధుడవు, తెలివైన వాడవు. అధికార్లతో నిజం చెప్పాలి.
లెవ్‌షిన్: నే నెందుకు అబద్ధం చెబుతాను?
బొబోయ్‌డోవ్: (ఆనందంతో) మంచిది. సరే, నీ యింట్లో ప్రతిమల చాటున యేమి దాచావో చెప్పు, నిజం చెప్పాలి, జ్ఞాపకముంచుకో.
లెవ్‌షిన్: ఏమీ లేదు.
బొబోయ్‌డోవ్: నిజమే చెబుతున్నావా?
లెవ్‌షిన్: ఆఁ! నిజమే.
బొబోయ్‌డోవ్: నీకు సిగ్గూ యెగ్గూ లేవు, లెవ్‌షిన్! బట్టతల ఐంది, జుట్టు నెరిసింది, ఐనా, కుర్రవాడిలాగు అబద్ధమాడుతున్నావా? అధికార్లకు ను వ్వేమి చేస్తున్నావో, నీ భావా లేమిటోకూడా తెలుసును. నా చేతిలోవున్న పుస్తకా లేమిటోచెప్పు, లెవ్‌షిన్!

లెప్షిన్: నాకు కనపడటంలేదు....నాకు దృష్టిమాంద్య ముంది.
బొబోయ్‌డోవ్: అవేమిటో నేను చెబుతాను. అవి ప్రభుత్వంచేత నిషేధింపబడిన పుస్తకాలు. ప్రజల్ని రెచ్చగొట్టి, జార్‌పై తిరుగబడమని రాజద్రోహాన్ని ప్రబోధిస్తున్నాయి. నీ యింట్లో ప్రతిమల వెనకాల వీటిని దాచావు....ఇప్పుడేమి సంజాయిషీ యిస్తావు?
లెప్షిన్: (శాంతంగా) ఏముంది? ఏమీలేదు.
బొబోయ్‌డోవ్: అవ్వి నీవేనని అంగీకరిస్తావా?
లెప్షిన్: నావే అయ్యుండవచ్చు .... అవి అన్నీ ఒక మాదిరిగానే కనిపిస్తాయి.
బొబోయ్‌డోవ్: పెద్దతనంలో యెందుకు అసత్యాలు చెబుతావ్?
లెప్షిన్: నేను నిజమే చెబుతున్నాను. నాయింట్లో ప్రతిమల వెనుక వున్నవేమిటని అడిగిన వెంటనే వాటిని మీరు తీసివేసి వుంటారు, ఇక నక్కడ యేమీ వుండదని గ్రహించి, ఏమీ లేవని చెప్పాను. ఇందులో నేను సిగ్గుపడవలసిన దేమీలేదు.
బొబోయ్‌డోవ్: (కలవరపాటుతో) ఓహో; అదా విషయం! బలే చమత్కారంగా మాట్లాడావుకదూ? అధికప్రసంగం కట్టిపెట్టి, అడిగినదానికి సరియైన సమాధానం చెప్పు.... నన్ను మోసగించడం నీతరంకాదు. ఈ పుస్తకాలు నీ కెవరిచ్చారు?
లెప్షిన్: ఆసమాచారం మీకెందుకండీ? నేను మరచిపోయాను కనుక సమాధానంచెప్పలేను. మధ్య మీకెందుకీ శ్రమ?

బొబోయేవోవు: ఏమిటీ! సరేం బాగుంది .... అలెగ్జ్ గ్రిగోవు!.... మీలో గ్రిగోవ్ యెవ్వరు?

గ్రిగోవు: నేను!

బొబోయెడోవు: పనివాళ్ల మధ్య విప్లవ ప్రచారం చేశావని స్మాలెంస్కులో పోలీసులు నిన్ను పట్టుకొని పరీక్ష చేశారా?

గ్రిగోవు: అం, చేశారు!

బొబోయెడోవు: ఇంత చిన్నవాడవు! తెలివైన వాడవు! నీ పరిచయం కలినందుకు చాలా సంతోషం. ఏమ్ నైనికులూ వీరిని పహారాలోకి తీసికొనిపొండి. ఇక్కడ ఉక్క పోస్తుంది. విరిపియేవు, యాకోవు?....సరే బాగుంది ... స్విస్టోవు. ఆంద్రీ?

యాకోవు: (నెమ్మదిగా) వాళ్లంటే నాకెంతో యిష్టం.

తాత్యానా. వీ రంతా యింత నిరాడంబరంగానూ, సరళంగానూ ఉంటా రెందుచేత?....వీ రింత తేలికగా మాట్లాడుతూ, పాపభీతి లేకుండా మనకండ్లలోకి నిస్సంకోచంగా చూస్తున్నారే! ఎందుచేత? వారికికూడా మమకారం, కోపం, తాపం, మున్నగు భావోద్రేకాలు లేవూ?

యాకోవు: కార్మికవర్గంపైగల అచంచల భక్తి- విశ్వాసాలే వారి యీ ప్రవర్తనకు కారణం.

తాత్యానా: వారికి భావోద్రేకాలూ, శౌర్య-ప్రతాపాలూ లేకపోవడం కాదు. ఇక్కడున్న మన అందరిపైన అసహ్యాత్ సహ్యాభావం వున్నై; కనపడటంలేదూ, వాళ్ల చూపుల్లో?

యాకోవు: ఆ లెవుషిన్ అద్భుతమైన మనిషి....ఎంత విచారపూరితమూ, ప్రేమార్ద్రమూ ఐన చూపులు చూస్తాడో! "దీంట్లో అర్థమేముంది? మా మార్గంలోనుంచి మీరు అడ్డుతొలగి, మా స్వతంత్రం ఇచ్చివేస్తే!" అంటూన్నట్లుంటాయి ఆ చూపులు.

జఖార్: (ద్వారంవద్ద నిలబడి చూస్తో) న్యాయచట్టాలను అమలు జరిపే యీ పెద్దమనుష్యుల బుద్ధిహీనతకు ఆశ్చర్యం కలుగుతోంది. ఈ కేసు అంతా కల్పితమే. ....నికోలాయ్ ప్రపంచ విజేతవలె ఱొమ్ము విరుచుకు తిరుగుతున్నాడు.

యాకోవు: ఈ తతంగ మంతా నీ కళ్లయెదుట జరుగుతోందనే అంశ మొక్కటే నీకు అభ్యంతరకరంగా వుందనుకుంటాను, ఏం జఖార్?

జఖార్: నిజమే. ఈ సంతోషదాయకమైన తంతు నాకండ్లయెదుట జరుపకపోతే నేమి? .... నాద్యా పూర్తిగా పిచ్చిదైపోయింది. నాతోటీ, పౌలినాతోటి బహు దురుసుగా మాటాడుతోంది. ఆ క్లియోపాత్రాను "గయ్యాళిగంప" అంది! ఇప్పుడు నాగదిలో మంచం మీద పడుకొని, ముఖం కందేటట్లు యేడుస్తోంది. ....ఏం జరుగుతుందో....ఏం జరుగనున్నదో, పరమేశ్వరుడికే యెరుక.

యాకోవు: ఈజరుగుతోన్నది చూస్తున్నకొద్దీ నాకు పరమ అసహ్యం పుట్టుకొస్తోంది జఖార్!

జఖార్: నిజమే, యాకోవు! కాని, యేమి చెయ్యగలం? నీ పై కూలీలు విరుచుకొని పడినప్పుడు, నిన్ను నీవు రక్షించు కోవాలా, అక్కరలేదా చెప్పు యాకోవు? ఈ భవనంలో, యిక్కడ మనం స్వేచ్ఛగా వుండవచ్చుననుకునే గదిగాని, గజం స్థలంకాని లేదు ....ప్రతిది తలక్రిందుగావుంది. పైగా ఇదే సమయానికి వర్షం కూడాను! చలి వణుకెత్తిస్తోంది.... ఈ ఆకురాలుకాలం యెంత త్వరగా వచ్చిందీ!

(నికోలాయ్, క్లియోపాత్రాలు ఉద్రేకంతో వస్తారు.)

నికోలాయ్: వాడికి లంచం పెట్టారనే విషయం నాకు నిర్ధారణగా తేలిపోయింది! ....

క్లియోపాత్రా: వీళ్ల కింత తెలివితేటలుకూడానా? వెనుకనుండి ఎవరో బలే తెలివైనవాడు యీ కూలీలను రెచ్చగొట్టి. నడిపిస్తున్నాడు.

నికోలాయ్: నీకు సింత్సోవుపై అనుమాన ముందా?

క్లియోపాత్రా: ఇంకెవ్వ రున్నారు? ఆహాఁ? ఇక్కడున్నారూ, కెప్టెన్ బొబోయ్‌దోవు!

బొబోయ్‌దోవు: (వసారాలోనుంచివచ్చి) ఏమి శెలవు?

నికోలాయ్: ఆ కుర్రవాడికి లంచంపెట్టారని నాకు బాగా అనుమానంగా వుంది. (గుస గుస లాడుతాడు)

బొబోయ్‌దోవు: (నెమ్మదిగా) ఒహో!.... ఊహూఁ!....

క్లియోపాత్రా: (బొబోయ్‌దోవుతో) బోధపడిందా మీకు కిటుకు?

బొబోయ్‌దోవు: అమ్మయ్య.... చూడండి! ఎంత మోసగాళ్లో! ....

(నికోలాయ్, కెప్టెన్ ద్వారంగుండా బయటకు మాట్లాకుంటూ వెళతారు. క్లియోపాత్రా చుట్టూ కలయజూచి తాత్యానాను ఓరకంట చూస్తుంది.)

క్లియోపాత్రా: ఓహో... ఇక్కడున్నావా నువ్వు!

తాత్యానా: ఏం. ఇప్పుడు కొత్తగా ఉపద్రవం యేమైనా వచ్చిందా?

క్లియోపాత్రా: ఏమిజరిగితే మాత్రం నీకు పోయే దేముందిలే! సింజోవు సంగతి విన్నావా?

తాత్యానా: ఊఁ.

క్లియోపాత్రా: (సవాల్‌చేసే గొంతుకతో) ఔను, వాడిని కూడా నిర్బంధంలో వుంచాం. దుండగీడుల నందరినీ ఫాక్టరీనుంచి యేరి పారవేశినందుకు నాకు చాలా సంతోషంగా వుంది....నీకు ఆనందంగా లేదూ?

తాత్యానా: నేను సంతోషించినా, విచారించినా, రెండూ ఒకటేగా నీకు? నా ప్రసక్తి ఎందు కిప్పుడు?

క్లియోపాత్రా: (ఈర్ష్యవల్ల కలిగినసంతోషంతో) నీకు ఆసింజోవుపై అనురాగముంది. (తాత్యానాను చూడగా ఆమెకు జాలి కలుగుతుంది.) అట్లా ముఖ మంతా వివర్ణమైపోయిందే మమ్మా, చాలా బాధ పడుతోన్నట్లు? కారణం యేమిటి?

తాత్యానా: చలిగాలివలన నేమో?

క్లియోపాత్రా: (ఆమెను సమీపించి) విను! బహుశా నేను తెలివి తక్కువగా మాట్లాడుతున్నా ననుకుంటా వేమో! .... నేను దాపరికం లేనిమనిషిని .... నా జీవితంలో

చాలా ధక్కా మొక్కీలు తిన్నాను. చాలా బాధలు అనుభవించి నా మనస్సు గడ్డకట్టి పోయింది. నా అనుభవంలో, ఆపదలోవున్న ఆడదానికి తోటిస్త్రీయే నిజమైన ఆంతరంగికురా లౌతుంది.

తాత్యానా: నన్నేమైనా అడగదలచుకున్నావా?

క్లియోపాత్రా: అడగటంకాదు, చెప్పదలచుకున్నాను. నువ్వంటే నాకు యిష్టం! అందరితోనూ నువ్వు చాలా సరళంగా ప్రవర్తిస్తావు. దుస్తులు ధరించేనేర్పు అనన్య దుర్లభం. అన్నిటికంటె ముఖ్యముగా మగవాళ్లని నీ కనుసన్నల్లో నిలుపగలవు. నీ మాటలతీరు, నడక తీరు చూస్తే, నీపై ఈర్ష్య కలుగుతుంది. నాకు కొన్ని సమయాల్లో నీపై ద్వేషంకూడా కలుగుతోంది.

తాత్యానా: చాలా సరదాగా వుందే. నాపై యింత అనురాగమున్న నీకు ద్వేషం యెందుకు పుడుతుంది?

క్లియోపాత్రా: (విచిత్రంగా) నువ్వేవరవు?

తాత్యానా: అంటే?

క్లియోపాత్రా: నువ్వేవరవో నాకు అర్థం కావడంలేదు. ప్రజల నిజ స్వరూపం తెలుసుకొని, వారి వాంఛలు అవగతం చేసుకోవాలనే కోరిక వుంటుంది నాకు. తమ వాంఛితాలను నిశ్చితంగా గుర్తించని మనుష్యులు చాలా ఉపద్రవకారులని నా అభిప్రాయం. వారిని నమ్మడం కష్ట

తాత్యానా: చాలా వింత సిద్ధాంతాలు చేస్తున్నావు. నీ అభిప్రా

యాలు నాపై రుద్దేందుకు ప్రయత్నిస్తున్నా వెందుకు?

స్త్రీయోపాత్రా: (దురుసుగాను, ఆందోళనతోను) మనుష్యులు స్నేహంగా వుండి ఒకరి కష్ట-సుఖాలు మరొకరితో చెప్పుకొని, ఒకరినొకరు విశ్వసించాలి. ఈ శ్రామికులు మనలను చంపివేయడం ప్రారంభించారు. మన కొంపను దోచివేయాలని ప్రయత్నిస్తున్నారు. ఇప్పుడు నిర్బంధింపబడినవారి ముఖాల్లో దోపిడిగాండ్ర కళలు కనిపించడం లేదూ? వారిలో ఐకమత్య ముంది. వారికి కావలసిందికూడా వారు ఎరుగుదురు. ఒకరినొకరు అర్ధం చేసుకొని, చాలా సన్నిహితంగా వుంటారు.... వారంటే నాకు ద్వేషమూ, భయమూ కూడా! వాళ్లూ మనమూ శత్రువులం! మనలను వారు విశ్వసించరు, వారంటే మనకూ నమ్మకంలేదు. మనం సైనికులు, పోలీసులపై ఆధార పడతాం. వారో! తమపైనే ఆధారపడతారు....ఐనా వాళ్లే మనకంటె బలవంతులు. వారిది అంగబలం; మనది అర్ధబలం!

తాత్యానా: నేనుకూడా నిన్ను ఒకప్రశ్న వేస్తాను. దాపరికం లేకుండా చెప్పు. నీ భర్తతో నువ్వు సుఖం అనుభవించావా?

స్త్రీయోపాత్రా: ఎందుకు అడుగుతున్నా వీ ప్రశ్న?

తాత్యానా: కేవలం కుతూహలంతో!

స్త్రీయోపాత్రా: (ఒక్కక్షణం ఆలోచించి) లేదు. ఆయనకు ఇతర వ్యవహారాలతో ఊపిరి తిరిగేది కాదు. నన్నుగురించి

ఆలోచించేందుకు, నాతో కులాసాగా గడిపేందుకూ, ఆయనకు తీరిక చిక్కేదికాదు.

పౌలీనా: (వస్తూ) విన్నారా మీ రీ సంగతి! ఆ గుమాస్తా సింజోవ్ సోషలిష్టని బయట పడింది. వింత ఏమిటంటే, జఖార్ అతడిని నమ్మి అన్ని రహస్యాలు చెప్పేవాడు. పైగా ఆసిస్టెంటు బుక్ కీపరు పని కూడా యిద్దా మనుకున్నాడు. దానివలన తలక్రిందు లయ్యేదేమీ లేదనుకో. చూడండి! ఈజీవితం యెంత చిక్కు సమస్య ఐపోయిందో! మన ఆజన్మ శత్రువులు కూడా మనకు అనుమానం తగులకుండా మన ప్రక్కనే నివశిస్తున్నారు .

తాత్యానా: భగవంతుని దయవలన నేను భాగ్యవంతురాలను కాను

పౌలీనా: కొద్దిగా ముసలిదాన వైన తర్వాత యీమాటలు మాట్లాడవు. (క్లియోపాత్రాతో మెత్తగా) క్లియోపాత్రా! మీకు దుస్తులు కుట్టించేందుకు పిలుస్తున్నారు. వెళ్లిరండి.

క్లియోపాత్రా: సరే. ఒంట్లో బాగా లేదు. గుండె దడగా వుంది. ఖాయలా పడటమంటే నాకు పరమ అసహ్యం.

పౌలీనా: గుండె నీరసానికి నావద్ద మంచి మందు వుంది. కావాలంటే యిస్తాను.

క్లియోపాత్రా: (వెడుతో) అభివందనాలు.

పౌలీనా: ఒక్కక్షణంలో వస్తాను. (తాత్యానాతో) ఆమెతో మెత్తగా మాట్లాడటం అవసరం. అప్పుడు ఆమె

కూడా చల్లబడుతుంది. ఆమెతో చాలాసేపు మాట్లాడి, మన లోకంలోకి తీసికొని వచ్చినందుకు సంతోషం టాన్యా! ...ఎంతటి ఒడి దుడుకు పరిస్థితుల్లో నైనా సరే, తొణక్కుండా, బెణక్కుండా వుండే చాకచక్యం వుంది నీకు..... నేనుపోయి ఆవిడకు మందు యిచ్చి వస్తాను.

(తాత్యానా ఒక్కతే వుంటుంది. వసారాలో నిర్బంధితుల నందరినీ సైనికులు వరుసగా నిలుచుండ బెట్టడం చూస్తూంటుంది. యాకోవ్ తలుపు సందునుంచి చూస్తాడు.)

యాకోవ్ (మనస్సుకు నొప్పి కలుగునట్లుగా) ఇంత సేపూ యిక్కడవుండి మీ సంభాషణ సాంతంగా విన్నాను.

తాత్యానా: (పరాకుగా) పొంచుండి పరుల రహస్యాలను వినడం మంచిది కాదంటారు పెద్దలు.

యాకోవ్: సర్వసామాన్యంగా, పరుల రహస్యాలను చాటుగా వినడం చాలా అసహ్యాకరంగా వుంటుంది. — ఆ రహస్యాలు మాటాడుకునేవారిపై జాలి కలుగుతుంది — సరే టాన్యా! నేను వెళ్లిపోతున్నాను.

తాత్యానా: ఎక్కడికి?

యాకోవ్: ఎక్కడికో ఒక చోటుకు....ఇంకా నిర్ధారణ చేసుకోలేదు. శలవు!

తాత్యానా: (ప్రేమతో) శలవు — తరుచు వ్రాస్తూంటావుకదూ?

యాకోవ్: ఈ ప్రదేశంమీద నాకు ద్వేషం పుట్టింది.

తాత్యానా: ఎప్పుడు వెడతావు?

యాకోవ్: (వింతగా నవ్వి) నేడే!—నువ్వుకూడా వెడతావేమో?

తాత్యానా: ఔను, నేనూ వెడదా మనుకుంటున్నాను. నవ్వుతున్నా వెందుకు?

యాకోవ్: కారణం చేమీలేదు—మనం ఒకరి నొకరం తిరిగి కలుసుకొనక పోవచ్చు.

తాత్యానా: ఏమిటీ అర్థంలేని మాటలు?

యాకోవ్: క్షమించు. (అతని ఫాలభాగాన్ని తాత్యానా ముద్దిడు కుంటుంది. ఆమెను మెల్లగా వదిలించుకుంటో, చిన్న నవ్వు నవ్వుతాడు) శవాన్ని ముద్దెట్టుకునే మాదిరిగా, నన్ను ముద్దెట్టుకున్నావు. (నెమ్మదిగా బయటకు వెడ తాడు. ఆతనివైపు చూస్తూన్న తాత్యానా వెంబడించ బోయి, ఆభావాన్ని అణచుకుని ఆగిపోతుంది. నాద్యా ఒక గొడుగువేసుకొని వస్తుంది)

నాద్యా: నాతో తోటలోకి రా—దయయుంచి రావమ్మా!—అదే పనిగా యేడిస్తే—తలకాయ నొప్పి వచ్చింది — ఐనా ఏడవటమెందుకు చెప్పు, మూర్ఖత్వం కాకపోతే! నే నొక్కత్తెనూ వుంటే, పట్టరాని దుఃఖం వస్తోంది.

తాత్యానా: ఎందు కమ్మాయీ, ఏడవడం? దుఃఖించవలసిన కారణం యేముంది?

నాద్యా: ఈ గొడవతో నాకు మతిపోయింది. తలా తోకా తెలియ డం లేదు. ఎవరిది న్యాయం? తాను చేసేపని న్యాయ

మంటాడు బాబాయ్. కాని, నాకుమాత్రం సబబుగా తోచడం లేదు. ఇదివరకు ఆయన చేసే ప్రతిపనీ న్యాయ సమ్మతంగా తోచేదినాకు. కాని, ఇప్పుడు ఆ న్యాయ బుద్ధిలో విశ్వాసం సడలింది. తన్ను సమర్థించు కుంటో ఆయన మాట్లాడేటప్పుడు నేనే పొరబడుతున్నా నని తోచి, ఆయనను గురించి నీచంగా భావించినందుకు సిగ్గు కలుగుతోంది. నా కేమీ దిక్కూ తెన్నూ తోచ డం లేదమ్మా!

తాత్యానా: (విచారంగా) ఈ విషయాలనుగూర్చి తీవ్రంగా ఆలో చిస్తే విప్లవవాది వైపోతావు. ఆ సంక్షోభంలో సర్వ నాశన మౌతావు—

నాద్యా: సరే, ఏదో ఒకటి అవాలి కదమ్మా! (తాత్యానా మృదు వుగా నవ్వుతుంది) ఎందుకు నవ్వుతున్నావ్? ఏమీ తెలుసుకోకుండా గ్రుడ్లు మిటకరిస్తో కూర్చోలేముకదా? అందుకని ఏదోఒకటి అయితీరాలి.

తాత్యానా: ఆకస్మాత్తుగా ప్రతివారూ ఇవాళ యిలాంటి మాటలే అంటున్నారు. అందుచేతనే నాకు నవ్వువచ్చింది. (వా రిద్దరూ బయటకు వెడతారు. దారిలో సేనాని, లెఫ్టినెంటు కలుస్తారు. లెఫ్టినెంటు చురుకుగా ప్రక్కకు తొలగి, మార్గం విడుస్తాడు)

సేనాని: సైనిక పమీకరణ తప్పనిసరి లెఫ్టినెంట్! దానివల్ల రెండు ప్రయోజనాలు సమకూడుతాయి. (నాద్యా, తాత్యానాలతో) మీ రెక్కడికి వెడుతున్నారు?

తాత్యానా: తోటలో తిరిగివద్దామని వెడుతున్నాం.

సేనాని: మీకు ఆ గుమాస్తా ఎదురైతే — లెఫ్టినెంట్! ఆ గుమాస్తా పేరేమిటి? ఇంతక్రితం పరిచయం చేశారే, వాడి పేరు?

లెఫ్టినెంట్: పొకాటీ, దేవరా!

సేనాని: (తాత్యానాతో) నాదగ్గరకు పంపించు. నేను భోజనశాలలో యీ లెఫ్టినెంటుతో కలసి టీ త్రాగుతుంటాను. హా—హా—హా! (చేతితో నోరు మూసుకుంటూ, చుట్టూకలయ జూస్తాడు) లెఫ్టినెంట్! నీకు చాలా జ్ఞాపకశక్తి వుంది— ఇది నిజంగా మెచ్చుకోవలసిన విషయం! తనపటాలంలోని ప్రతి సైనికునిపేరూ, ముఖం ఆనమాళ్లూ అధికారి తెలిసికొని వుండాలి. కొత్తగా సైన్యంలో చేరినవాడు కుయుక్తి పరుడూ, బద్ధకస్తుడు బుద్ధి హీనుడూ అయితే అధికారి ఆ సైనికునిలోదూరి, వాడిని విద్యుక్తధర్మం నెరవేర్చగల కర్తవ్యపరాయణునిగా మార్చి పారేసెయ్యాలి.

(జఖార్ వచ్చాడు. బాగా విసుగ్గా వుంటాడు)

జఖార్: మామా! యాకోవ్ కనుపించలా?

సేనాని: లేదు, నేను చూడలా—అక్కడ టీ తయారుగావుందా?

జఖార్: ఆ! (సేనాని, లెఫ్టినెంటు వెళ్లిపోతారు. కోపంతో జుట్టువిరబోసుకొని, కాన్ వసారానుండి వస్తాడు) కాన్, మాతమ్ముడు కనుపించాడా?

కాన్: లేదు. నేటినుంచీ నానోరు మెదిపితే ఒట్టు! నేను ఒక

మనుష్యుని నాకళ్లారా చూచినా సరే! నోరు విప్పి చెప్పను!—నోరు విప్పి చెబితే, మారుపేరు పెట్టండి. ఈపాడు ప్రపంచంలో యేది మాట్లాడినా తంటాయే!

పౌలీనా: (ప్రవేశించి) భూమిపాలు యీ యేడాది కివ్వలేమనీ, ఒక సంవత్సరం గడువు యిప్పించాలనీ మనరైతులు మళ్లీ వచ్చి కోరుతున్నారు.

జఖార్: ఆహాహా! వారికి బలే మంచిసమయం దొరికింది!

పౌలీనా: ఈపంట బాగా పాడైపోయిందట! ప్రస్తుతం యేమీ యిచ్చుకోలేమని చెప్పుకుంటానికి వచ్చారు.

జఖార్: ఏడవ గలిగితేనే వ్యవసాయం చేయ వని సామెత! పండినా యెండినా ఒకేవిధంగా గోలపెడతా రీ రైతులు. నీకు యాకోవ్ కనిపించాడా?

పౌలీనా: లేదు. వాళ్లతో యేమి చెప్పమంటావు?

జఖార్: రైతులతోనా? వాళ్లని ఆఫీసుకు వెళ్లమని చెప్పు. వాళ్లతో మాట్లాడాలని లేదు నాకు.

పౌలీనా: ఆఫీసులో మాత్రం యెవ రున్నా రిప్పుడు? అంతా అరాచకంగా వున్నసంగతి మీకే తెలుసుకదా! అప్పుడే భోజనాల సమయ మైంది. ఐనాసరే, ఆ లెఫ్టినెంటు టీ యివ్వమని అడుగుతున్నాడు. ఆ దేగిసాలో నీళ్లు ప్రొద్దుటినుంచీ ధ్వజాయమానంగా మరుగుతూనే వున్నాయి. ఇంతవరకూ పొయ్యి మీద నుంచి దింపనే లేదు. మన మేదో పిచ్చివాళ్ల గృహంలో వున్నా మని పిస్తోంది.

జఖార్: మన యాకోవ్‌కు యెక్కడికైనా లేచిపోవాలని అకస్మాత్తుగా బుద్ధిపుట్టిన సంగతి నీకు తెలుసా?

పౌలీనా: నేను యిట్లా అంటున్నానని కోపగించక క్షమించండి. అతడు వెళ్లిపోవడమే మంచిది.

జఖార్: నువ్వు చెప్పినమాట నిజమే. ఈ మధ్య మరీ కోపం హెచ్చిపోయి, మతిలేని మాట లంటున్నాడు. నా రివాల్వరుతో గురిచూచి కాకినికొట్టగలమా అని యింతకు క్రితం న న్నడిగాడు. రెండుమూడు నిందావాక్యాలు పలికి, నా రివాల్వరు పుచ్చుకొని వెళ్లాడు ....అ స్తమానమూ చెడత్రాగు తున్నాడు.

(ఇద్దరు సైనికులూ, క్వాష్ వసారానుండి సింజోవ్‌ను తీసికొని వస్తారు. పౌలీనా మాట్లాడకుండా అతనివేపు కనుమూలలనుంచి చూచి, యెదుటకు వెళ్లిపోతుంది. జఖార్ కండ్లజోడు సర్దుకొని ముందుకు వెళ్లిపోతాడు.

జఖార్: (నిందాపూర్వకంగా) ఎంత దురదృష్టమో చూడు సింజోవ్! నీకొరకు చాలా విచారపడుతున్నాను .... చాలావిచారంగావుంది.

సింజోవ్: (నవ్వుతో) మీరు విచారించకండి.... మీరు విచారించవలసినంత పెద్ద విషయంకాదు.

జఖార్: కాకపోవడ మేమిటి? మనుష్యులు ఒకరిపై నొకరు సానుభూతి చూపుకోవాలి. నే నెంతో విశ్వసించిన మనిషే, నా నమ్మకను దుర్వినియోగపరచినప్పటికీ, కష్టాలలో చిక్కుకున్నప్పుడు నాకు జాలి కలిగింది.

"అపకారికి నుపకారము నెపమెన్నక సేయవలె"
అన్నట్లు నా స్వభావమే అంత! శలవు సింజోవ్!

సింజోవ్: శలవు.

జఖార్: నాపై నీ కేమీ కోపంలేదుకదా?

సింజోవ్: ఏమీ కోపంలేదు.

జఖార్: (తొట్రుపాటుతో) చాలా బాగుంది. సరే, ఇకశలవు. నీ జీతం నీకు పంపివేస్తాను....(వెడుతో) నాయిల్లు యీ సైనికులకు కేంద్ర కార్యాలయంగా మారిపో యింది. ఈ దుస్థితిలో పడిపోయాను. సహించడంకష్టం (సింజోవ్ నవ్వుతాడు. క్వాష్ అతడిని, ముఖ్యంగా చేతులను తీవ్రంగా పరీక్షిస్తూంటాడు. సింజోవ్‌కూడా క్వాష్ కండ్లలోకి రెండు క్షణములకాలం గట్టిగా చూస్తాడు. ఉన్నట్టుండి క్వాష్ నవ్వుతాడు.)

సింజోవ్: నవ్వుతున్నావెందుకు?

క్వాష్: (ఆనందంతో) ఏమీలేదు.... నిష్కారణంగానే ....

బొబోయ్‌డోవ్: (వస్తూ) సింజోవ్! నిన్ను పట్టణం పంపిస్తున్నాం.

క్వాష్: (ఆనందంతో) దేవరా! ఈయన పేరు సింజోవ్‌కాదు. ఈయన కథంతా వేరేవుంది.

బొబోయ్‌డోవ్: ఏమిటీ? స్పష్టంగా చెప్పు.

క్వాష్: నాకు తెలుసునండీ! వీడు బ్రియాన్స్కు ఫాక్టరీలో పని చేస్తుండేవాడు. అక్కడ వీడిపేరు మాక్జింమార్కోవ్! ....రెండేళ్లక్రితం వీణ్ణి నిర్బంధించాము దేవరా! .... వీడి ఎడమ బొటనవ్రేలికి గోయలేదు. అదే నాకు గుర్తు!

మారుపేరుతో ఇక్కడ తిరుగుతున్నా డంటే జైలు నుంచో, సైబీరియా ప్రవాసంనుంచో పారిపోయి వుండాలన్నమాట!

బొబోయ్‌డోవ్: (ఆశ్చర్యపడి, సంతోషంతో) ఈ సమాచారం వాస్తమేనా సింజోవ్?

క్వాష్: నేను చెప్పింది అక్షరాలా నిజం దేవరా!

బొబోయ్‌డోవ్: ఐతే నువ్వు సింజోవ్ కాదన్నమాట! సరే, బాగుంది.

సింజోవ్: నే నెవ్వరినైనప్పటికీ మీరు నాతో మర్యాదగా ప్రవర్తించవలసి వుంటుంది. ఈ విషయం మరచి పోవద్దు.

బొబోయ్‌డోవ్: ఓహో! నువ్వు సామాన్యుడవు కాదన్నవిషయం కనిపిస్తూనేవుంది. క్వాష్! నువ్వే కూడావుండి జైలుకు తీసికొనివెళ్లు. భద్రం! బహు జాగ్రత్తగా రెండుకళ్లూ తెరుచుకొని వుండాలి. ఆదమరచి వుండకూడదు.

క్వాష్: చిత్తం, దేవరా!

బొబోయ్‌డోవ్: (సంతోషంతో) సరే బాగుంది! సింజోవ్‌గారూ! మీ పే రేదైనా సరే, మిమ్మ్మ పట్టణం పంపుతున్నాం. (క్వాష్‌తో) అక్కడికి వెళ్లిన తక్షణం నీకు తెలిసిన దంతా చెప్పి, ఇతని వెనకటి పోలీసు రికార్డు అంతా తెప్పించి చూడండి! ఈ వ్యవహారం నేనే స్వయంగా చూడటం మంచిది. ఒక్క నిమిషం ఆగు క్వాష్! (త్వరగా బయటకు వెడతాడు.)

క్వాష్: ఐతే, ఇక్కడ యీ రూపంలో మళ్లీ కలుసుకున్నా

మన్న మాట!

సింజోవ్: (నవ్వుతో) నీకు సంతోషంగా వుందా?

క్వాష్: ఎందుకు సంతోషంగా వుండదు? మనిద్దరమూ పాత పరిచితులమేగా!

సింజోవ్: (అసహ్యంతో) ఇప్పటికైనా యీ బాడుఖావ్ నౌకరీ చాలించుకుంటే బాగుంటుంది. ముగ్గుబుట్టలాగు తల నెరుస్తోంది. ఇంకా కుక్కలాగు మనుష్యులను వెంబడించి, పసిగడుతున్నావు .... ఈ నీచపు పని అంటే విరక్తి కలగడంలేదూ?

క్వాష్: (సరదాగా) అలవాటుపడిపోయాను. ఇరవై మూడు సంవత్సరాలనుండి యిదే వృత్తి నాకు. నాకూ కుక్కకూ పోలికా? మా పై అధికార్లకు నాపైన చాలామంచి అభిప్రాయముంది. నాకు పతకం బహూకరిస్తారని తెలుస్తోంది. ఈదెబ్బతో యిచ్చేస్తారు, సందేహంలేదు.

సింజోవ్: నన్ను పట్టుకున్న దందుకేనా?

క్వాష్: అహా! విధిగా యిస్తారు. ఎక్కడనుండి తప్పించుకు వచ్చావ్?

సింజోవ్: తినబోతూ రుచులెందుకు? నువ్వే త్వరలో కనిపెట్టేస్తావుగా?

క్వాష్: ఓ, అదెంతపని. మేమే కనిపెట్టివేస్తాం. మీ బ్రియాన్స్క్ ఫాక్టరీలో నల్లజుట్టువాడు ఉండేవాడే, జ్ఞాపకం వుందా? ఆయన ఒక ఉపాధ్యాయుడు. సావిట్స్కి ఆయనపేరు. ఈమధ్యనే ఆయన్ని

పట్టివేశాం.....కాని ఖైదులో చచ్చిపోయాడు....చాలా జబ్బుపడ్డాడు.....ఐనా మీ రాష్ట్రమేమంది లేరు. పట్టుమని చూస్తే వేళ్లమీద లెక్కించవచ్చు.

సింజోవ్: (ఆలోచనాపూర్వకంగా) ఆగి చూడవయ్యా మే మెంత మంది వుంటామో! వేలు, లక్షలూ ఐపోతాం.

క్వాష్: ఓహో! చాలా బాగుంది. మీ విప్లవవాదు లెంత పెరిగితే మా కంత లాభం!

సింజోవ్: చాలా చాలా బహూమతులు, పతకాలూ కదూ? (బొబోయ్‌డోవ్, సేనాని, లెప్టినెంటు, క్లియోపాత్రా, నికోలాయ్‌లు ద్వార వద్దకు వస్తారు.)

నికోలాయ్: (సింజోవ్ వైపు చూసి) ఈరకంగా పరిణమిస్తుందని ముందునుంచీ అనుకుంటోనే వున్నా. (వెళ్లిపోతాడు)

సేనాని: బలే మనిషికింద తేలిపోయాడే!

క్లియోపాత్రా: ఈ కుట్రకు కారకుడెవరో యిప్పుడు తేలిపోయింది.

సింజోవ్: (పరిహాసంగా) విన్నావా, కెప్టెన్! శుద్ధ తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నావని యిప్పటికీ కనిపెట్టలేదూ?

బొబోయ్‌డోవ్: నాకు....నాకు పాఠాలు చెప్పడం మానవోయ్!

సింజోవ్: (దృఢస్వరంతో) ఆ! తప్పక చెబుతాను. ఈ పిచ్చి నాటకం అంతా కట్టిపెట్టు.

సేనాని: ఆహాహా! ఆయన చెప్పినట్టు నడుచుకోండి!

బొబోయ్‌డోవ్: (ఉచ్చస్వరంతో) క్వాష్! వీడిని తక్షణం తీసికొని పోండి!

క్వాష్: చిత్తం దేవరా! (సింజోవును తీసికొనిపోతాడు)

సేనాని: నిజమైన పెద్దపులికదూ? గాండ్రుమని అరుస్తున్నాడు.
క్లియోపాత్రా: వీడే కారకు డనేందుకు సందేహంలేదు.
బొబోయ్‌డోవ్: వీడే తెరవెనుకనుంచి నడిపించి వుంటాడు .... తప్పక అంతే.
సేనాని: చాలా తెలివైన ఘటం! గుల్ల చేపలాంటివాడు గుటుక్కున నోట్లో పడ్డాడు. స్వాహా!
బొబోయ్‌డోవ్: దేవరా; ఇక త్వరలోనే యీతతంగమంతా ముగించి వేద్దాం. నికోలాయ్ వాస్సిలీవిచ్! ఎక్కడున్నారు? (అందరూ గదిలోనుంచి ద్వారాలగుండా బయటకు వెళ్లిపోయారు. వసారాలోనుంచి పోలీసు ఆఫీసరు వస్తాడు)
పోలీసుఆఫీసరు: (కాన్‌తో) విచారణ ఇక్కడే జరుగుతుందా?
కాన్: (చిరాకుగా) నాకు తెలియదు.... నాకేమి తెలియదు.
పోలీసుఆఫీసరు: ఇవిగో, ఇక్కడొక బల్ల, కాగితాలూ వున్నాయి. ఇక్కడే అయ్యుంటుంది. (వసారాలోనున్న సైనికులతో) ఏయ్! వాళ్లని లోపల హాజరుపరచండి (కాన్‌తో) చనిపోయిన డైరెక్టరు పొరపడ్డారు. ఆయనపై తుపాకి కాల్చినవాడు ఎర్రజుట్టువాడని చెప్పారుకాని హంతకుడు నల్లవాడని తేలిపోయింది.
కాన్: (గొణుగుతో) చచ్చినవాళ్లేగాదు, బ్రతికున్నవాళ్లుకూడా పొరబడతారు. (నిర్బంధితులను తీసికొనివస్తారు.)
పోలీసుఆఫీసరు: ఇక్కడ వరుసగా నిలబెట్టండి! ఏయ్ ముసిలాడ! నువ్వే చివర నిలబడు. నీకు సిగ్గూ యెగ్గూ లేదురా

ముసలిదెయ్యమా!

గ్రికోవ్: నోటికి వచ్చినట్లల్లా మాట్లాడుతా వెందుకయ్యా?

లెవ్‌షిన్: ఊరుకో, గ్రికోవ్! హంసలు ఎగురుతోంటే కుక్కలు మొరుగుతూంటాయి.

పోలీసుఆఫీసరు: (బెదిరింపుగా) చాల్లే, కట్టిపెట్టు! అట్టే వాగకు!

లెవ్‌షిన్: ఇదే, ఈయన ఉద్యోగం! పరుషంగా మాట్లాడి, తనగౌరవాన్ని వెళ్లబోసుకుంటాడు.

(నికోలాయ్, బొబోయ్‌దోవులువచ్చి బల్ల వెనుకవున్న కుర్చీలపై ఆసీనులౌతారు. సేనాని మూలనున్న పడక కుర్చీపై పడుకుంటాడు. ప్రక్కగా లెప్టినెంటు నిలబడతాడు. ద్వారంవద్ద పౌలీనా. క్లియోపాత్రాలు నిలబడుతారు. తరువాత తాత్యానా, నాద్యాలుకూడా వారితో కలుస్తారు. వారివెనుక నిలబడి జఖార్ అసంతృప్తిగా చూస్తూంటాడు. ఎక్కడనుంచో పౌలోగీ ఊడిపడి కుర్చీల మీద కూర్చున్నవారికి సలాం చేసి, గదిమధ్యనున్నందుకు కంగారుపడతాడు. సేనాని ఆతణ్ణి పిలుస్తాడు. పౌలోగీ మునికాళ్లమీద నడిచెళ్లి, సేనాని పడకకుర్చీవద్ద నిలబడతాడు. ఇంతలో రయాబట్‌జోవ్‌ను తీసికొనివస్తారు.

నికోలాయ్: ఇక ప్రారభిద్దాం. పావెల్ రయాబట్‌జోవు....

రయాబట్‌జోవు: ఆఁ!

బొబోయ్‌దోవు: ఆఁ అనకూడదురా మూర్ఖుడా! "చిత్తం దేవరా!" అను.

నికోలాయ్: ఐతే నువ్వే డైరెక్టరును చంపానంటావా?
రయాబట్‌జోవు: ఆఁ! నేనే చంపానని చెప్పాగా! ఇంకా ఏం కావాలి?
నికోలాయ్: అలెగ్జి గ్రికోవును యెరుగుదువా?
రయాబట్‌జోవ్: ఎవరది?
నికోలాయ్: నీ ప్రక్క నిలబడివున్న కుర్రాడు.
రయాబట్‌జోవు: ఈయన మాఫాక్టరీలో పనిచేస్తున్నాడు.
నికోలాయ్: అంటే మీరు పరిచితులే నన్నమాట?
రయాబట్‌జోవు: మే మందరమూ పరిచితులమే.
నికోలాయ్: ఔను, సహజమే! నీ తీరిక సమయాల్లో అతడియింటికి పోయి కాలం గడుపుతూంటావా? .... అంటే నీకూ యీ కుర్రవాడికీ బాగా స్నేహముందా?
రయాబట్‌జోవు: నా తీరిక సమయాల్లో అందరినీ కలుసుకొని, కులాసాగా కాలం గడుపుతాను. అందరూ నాకు స్నేహితులే.
నికోలాయ్: నిజంగా! నువ్వు నిజం చెప్పడంలేదు. పొలోగీ! ఈ రయాబట్‌జోవు గ్రికోవుల సంబంధమెట్టిదో నువ్వు చెప్పు.
పొలోగీ: చాలా సన్నిహిత మైత్రి.... ఈ కార్మికుల్లో రెండు ముఠాలున్నై. ఒక ముఠాకు గ్రికోవు అధిపతి. ఆ యువకుడు తనకంటె యెన్నోరెట్లు గొప్పవారైన అధికులయెడ వినయవిధేయతలు చూపక, నిర్లక్ష్యంగా సంచరిస్తాడు. పెద్దవారి ముఠాకు లెవ్‌షిన్ నాయకుడు.

ఆకుకు అందకుండా, పోకను పొందకుండా, విపరీతంగా మాట్లాడతాడు. సక్కవంటి చిత్తులమారి!

నాద్యా: అరి, పరమనీచుడా!

(పొలోగీ కలయచూచి, ప్రశ్నార్థకంగా నికోలాయ్‌వైపు చూస్తాడు. నికోలాయ్ నాద్యావంక తీక్షణంగాచూస్తాడు.

నికోలాయ్: సరే. తరువాత.

పొలోగీ: (నిట్టూర్చి) వీరందరికీ హారంలో సూత్రంవంటి వాడు సింజోవు. అందరితోనూ మంచిగా వుంటాడు. వాళ్లూ, భక్తితోవుంటారు. ఈవ్యక్తి సామాన్యులవలెకాక, అన్నిరకముల పుస్తకములను పఠించి, ప్రతివిషంపైన తన సాభిప్రాయములను కలిగి వుంటాడు. ఆయన గృహంలో మూడు గదు ఉన్నాయి....

నికోలాయ్: ఆవివరాలు అప్రస్తుతం.

పొలోగీ: క్షమించాలి. యదార్థం సమగ్రస్వరూపంతోగాని వ్యక్తమవదు. అన్నిరకాల మనుష్యులూ సింజోవ్ యింటిలో చేరుతుంటారు. వారిలో గ్రికోవ్ కూడా ఒకడు.

నికోలాయ్: గ్రికోవ్! ఇది వాస్తవమేనా?

గ్రికోవ్: నన్నేమీ ప్రశ్నించవద్దు, సమాధానమివ్వను.

నికోలాయ్: నువ్వు తిరస్కరించడంవల్ల ప్రయోజనంలేదు.

నాద్యా: (బిగ్గరగా) బనే బాగా సమాధానం చెప్పాడు.

క్లియోపాత్రా: ఈ పిచ్చివేషా లేమిటి?

జఖార్: నాద్యా! అమ్మాయ్!

బొబోయెడోవ్: ఉ ష్ ష్ !

(వసారాలో గందరగోళం)

నికోలాయ్: సంబంధంలేనివారిని, యిక్కడ యెందుకు ఉండని వ్వాలో నాకు బోధపడటంలేదు....

సేనాని: ఊహూ!! సంబంధించని వా ళ్లెవరనీ నీవుద్దేశ్యం?

బొబోయ్‌దోవ్: క్వాష్! పోయి, ఆవసారాలో ఆగొడవ యేమిటో చూడు.

క్వాష్: ఆతలుపును తెరిచేందుకు యెవరో ప్రయత్నిస్తున్నారు. దేవరా! బూతులు తిడుతో, తలుపుతెరవకపోతే, విరగ కొడతానంటున్నాడు. దేవరా!

నికోలాయ్: ఎవరువాడు? వాడి కేం కావాలి?

బొబోయ్‌దోవ్: పోయి, చూసిరా!

పొలోగీ: నా సాక్ష్యం చెప్పమని శెలవా, ముగించనా?

నాద్యా: ఓరి చీడపురుగా!

నికోలాయ్: చాలించు ... ఈకేసుకు సంబంధించని వా రందరూ బయటకుపొండి.

సేనాని: అంటే దాని అర్థం యేమిటి?....మా సంగతేమిటి?

నాద్యా: (ఉద్రేకంతో అరుస్తో) మీరే సంబంధించనివాళ్లు! నేను కాదు, మీరే ఇక్కడ వుండేందుకు అనర్హులు .... ఈయిల్లు నాది.... మీ అందరినీ యిక్కడనుంచి వెళ్లి పొమ్మని కోరేందుకు నాకు హక్కుంది.

జఖార్: (నాద్యాతో ఆగ్రహంగా) తక్షణంపో, యిక్కడ నుంచి! వినపడుతోందా? .... తక్షణం!

నాద్యా: నిజంగానే వెళ్లిపొమ్మంటున్నావా? .... సరే .... నే

నిక్కడ సంబంధించనిదానిననేగా దానిఅర్థం. నేను వెళ్లిపోతున్నాను గాని, వెళ్లేముందు మీతోయీవిషయం స్పష్టంగా చెప్పి మరీపోతాను.

పౌలీనా: దానిని పట్టుకోండి. లేకపోతే అవాకులు, చవాకులు పేలుతుంది.

నికోలాయ్: (బొబోయ్‌డోవ్‌తో) తలుపులు వేసెయ్యమని సైనికులతో చెప్పండి.

నాద్యా: మీకు అంతఃకరణలేదు .... హృదయంలేదు! మీరందరూ పరమనీచులూ, అసహ్యకరమైన మనుష్యులు....

క్వాష్: (ఆనందంతో ప్రవేశించి) దేవరా! మరొకణ్ణి పట్టుకున్నాం!

బొబోయ్‌డోవ్: ఏమిటి?

క్వాష్: మరొక హంతకుడువచ్చి పట్టుబడ్డాడు. (ఎర్రజుట్టు, పొడుగు మీసాలుకల అకిమోవ్ అను యువకుడు నెమ్మదిగానడచి, బల్లవద్దకు వస్తాడు)

నికోలాయ్: (గొంతుపాటుతో) ఏం కావాలి నీకు?

అకిమోవ్: డైరెక్టరును చంపినవాణ్ణి నేను.

నికోలాయ్: నువ్వా?

అకిమోవ్: ఔను, నేనే!

క్లియోపాత్రా: (నెమ్మదిగా) ఓరి నీచుడా!....ఐతే నీకూ అంతఃకరణ వుందన్నమాట.

పౌలీనా: ఓయిదేముడా!....ఎంత భయంకరమైన మనుష్యులు!

తాత్యానా: (గంభీరంగా) ఈ ప్రజలే నెగ్గుతారు.

అకిమోవ్: (చిరాకుగా) ఆఁ! నేనే వచ్చి పట్టుబడ్డాను. మీఅందరికీ తృప్తి కలిగిందా?

(అందరూ కలవరపడతారు. బొబోయెడోవ్ చెవిలో నికోలాయ్ యేదో రహస్యం చెబుతాడు. బొబోయ్ డోవ్ తత్తరపాటుతో నవ్వుతాడు. నిర్బంధితులు నిశ్చేతనులై, మౌనంగా నిలబడతారు. ద్వారంవద్ద నిలబడి అకిమోవ్ వంక చూస్తో, నాద్యా యేడుస్తోంది. పౌలీనా జఖార్ లు గుసగుసలాడుకుంటారు. ఆ నిశ్శబ్దంలో గంభీరమైన తాత్యానా స్వరం నెమ్మదిగా, ప్రస్ఫుటంగా వినపడుతుంది)

తాత్యానా: (నాద్యాతో) ఏడవకు, చివరకు యీ ప్రజలే నెగ్గుతారు.

నికోలాయ్: రయాబట్ జోవ్! ఏమంటావయ్యా దీనికి?

రయాబట్ జోవ్: (రిచ్చపాటుతో) నేను.... నేను....

అకిమోవ్: నోరు మూసుకో, పాషా! .... నువ్వు మాట్లాడకు.

లెవ్ షిన్: (ఆనందంతో) సోదరులారా! వీరూ వాస్తవమైన ప్రజలు. మీకు క్షేమఉజ్జీలు!

నికోలాయ్: (బల్లగుద్ది) నిశ్శబ్దం!

అకిమోవు: (గంభీరంగా) అరవకండయ్యా! మేము గట్టిగా మాట్లాడుతున్నామా?

నాద్యా: (బిగ్గరగా) విను, నిజంగా నీవే చంపానంటావా? వాళ్లే అందరినీ చంపుతున్నారు .... వాళ్ల దురాశతోటీ, పిరికితనం తోనూ, జీవితాన్నే నాశనం చేస్తున్నారు.... (అందరినీ ఉద్దేశించి) మీరే దోషులు!

లెవ్‌షిన్: (ఉత్సాహంతో) నువ్వు చెప్పింది నిజం అమ్మాయీ! ఆఖరుదెబ్బ వేసినవాడుకాదు హంతకుడు. ద్వేషం పుట్టించి, దుస్సహ పరిస్థితులు కల్పించేవారే, యదార్థంగా హంతకులు. నువ్వు చెప్పింది ముమ్మాటికీసత్యం (గందరగోళం) అకిమోవ్! చాలా పెద్దపని చేశావయ్యా....

బొబోయ్‌డోవు: నిశ్శబ్దం!

నాద్యా: (అకిమోవుతో) ఏం, ఎందుకువచ్చి పట్టుబడ్డావ్?

లెవుషిన్: అరవకండి, దేవరా! నేను తమకంటె పెద్దవాణ్ణి.

అకిమోవు: (నాద్యాతో) నీవు బోధపడదమ్మా! ఇక్కడనుంచి వెళ్లిపోవడం మంచిది.

క్లియోపాత్రా: ఈ ముసలివాడు యింతకాలం ఋషిలా నటించాడుకదా!

బొబోయ్‌డోవు: క్వాష్!

లెవుషిన్: సరే, బాగుంది. ఇంకా ఆలస్యం దేనికి అకిమోవు? చెప్పెయ్యి నీ గుండెలమీద పిస్తోలుతో కొట్టాడని, అప్పుడు నువ్వు ఆత్మరక్షణకోసం తప్పనిసరిఅయి ....

బొబోయ్‌డోవు: (నికోలాయ్‌తో ) విన్నారా, ఆ ముసలివాడు పచ్చి అబద్ధాలకోరు. వాడికి కూడా అబద్ధాలు నేర్పుతున్నాడు.

లెవ్‌షిన్: నేను అబద్ధాలకోరును కాదు!

నికోలాయ్: సరే, రయాబట్‌జోవు: ఇప్పు దేమంటావు?

రయాబట్‌జోవు: నేను—

లెవుషిన్: మాట్లాడకు! నోరు విప్పకు! వీళ్లు బలే తంత్రజ్ఞులు. కుయుక్తిపరులు! మనకంటె యుక్తిగా మాటలను వాడగలుగుతారు.

నికోలాయ్: (బొబోయ్‌డోవుతో) వాణ్ణి బయటకు గెంటివెయ్యండి.

లెవుషిన్: వద్దు, గెంటివెయ్యనవసరంలేదు! ఎవరో ఒకరు గెంటి వేయబడే రోజులు దగ్గర పడుతున్నాయ్! మేము చాలా కాలంనుంచి అంధకారంలో- ఏ హక్కులూ లేకుండా దాస్యంలో ఉంచబడ్డాం చిరకాలంనుంచీ! ఇంకా యెందుకూ? ఇప్పుడు మాలోనే అగ్ని రగుల్కుంది. ఈ జ్వాలను యింకెవవ్వరూ ఆర్పలేరు! మీరా? మీరు అసలే ఆర్పలేరు!

(తెర)

సమాప్తం



